# భారతదేశ ప్రజలమయిన మేము...

## (We, the people of India...)

### 70 సం॥రాల రాజ్యాంగ విశ్లేషణా వ్యాసాలు




సంకలనం & సంపాదకత్వం

గౌరవ్

# భారతదేశ ప్రజలమయిన మేము...

## (We, the people of India...)

### 70 సం॥రాల రాజ్యాంగ విశ్లేషణా వ్యాసాలు

సంపాదకత్వం
& : గౌరవ్
సంకలనం

సంవత్సరం : నవంబర్, 2019



ఇందులోని అభిప్రాయాలన్నింటితోనూ సంపాదకుడు
విధిగా అంగీకరించనవసరం లేదు.

ప్రతిపాదిత విరాళం : రూ. 50/-

ప్రతులకు : 9032094492

వివరాలకు : gouravmeka@gmail.com

---

## అంకితం

## కాశ్మీరీలందరికీ...



భారత రాజ్యాంగ ప్రవేశిక

భారతదేశ ప్రజలమైన మేము భారతదేశాన్ని
సర్వసత్తాక, సామ్యవాద, లౌకిక, ప్రజాస్వామ్య, గణతంత్ర
రాజ్యముగ నిర్మించుకోవడానికి పౌరులందరికి
సాంఘిక, ఆర్థిక, రాజకీయ న్యాయాన్ని
ఆలోచన, భావప్రకటన, విశ్వాసము,
ధర్మము, ఆరాధనలలో స్వేచ్ఛను
అంతస్తు (హోదా) లోను, అవకాశములోను సమానత్వమును
చేకూర్చుటకు మరియు వారందరిలో
వ్యక్తి గౌరవమును, జాత్యైక్యతను మరియు
అఖండతను తప్పక సంరక్షిస్తూ సౌభ్రాతృత్వాన్ని
పెంపొందించుటకు సత్యనిష్ఠాపూర్వకముగ తీర్మానించుకొని
**26 నవంబరు 1949న**
మన రాజ్యాంగపరిషత్తులో పరిగ్రహించి
శాసనంగా రూపొందించుకొన్న
ఈ రాజ్యాంగాన్ని మాకు మేము సమర్పించుకుంటున్నాము.

"WE, THE PEOPLE OF INDIA, having solemnly resolved to constitute India into a SOVEREIGN SOCIALIST SECULAR DEMOCRATIC REPUBLIC and to secure to all its citizens: JUSTICE, social, economic and political; LIBERTY of thought, expression, belief, faith and worship; EQUALITY of status and of opportunity; and to promote among them all; FRATERNITY assuring the dignity of the individual and the unity and integrity of the Nation:

IN OUR CONSTITUENT ASSEMBLY this twenty-sixth day of November, 1949, do HEREBY ADOPT, ENACT AND GIVE TO OURSELVES THIS CONSTITUTION."

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| | ప్రస్తావన | 5 |
| 1. | **ఈ సంకల్పం ఎందుకంటే...** – గౌరవ్ | 6 |
| 2. | **"భారతదేశ ప్రజలమైన మేము..." భారత రాజ్యాంగం – ఓ పరిశీలన** | 8 |
| | – డా॥ అవధానం రఘు కుమార్ | |
| 3. | **సనాతన ధర్మం నుండి సామాజిక న్యాయం దిశగా భారత రాజ్యాంగ నిర్మాణం** | |
| | – ఆచార్య కె.ఎస్. చలం, | 24 |
| 4. | **భారత రాజ్యాంగం – ఆచరణానుభవాలు** | |
| | – గొర్రెపాటి మాధవరావు | 30 |
| 5. | **రాజ్యాంగ పరిరక్షణ – కొన్ని ఆలోచనలు** | |
| | మూలం : మీరా సంఘమిత్ర, అనువాదం : గుత్తా రోహిత్ | 39 |
| 6. | **మార్పుతీసుకొని రాగల రాజ్యాంగ శక్తి** | |
| | **(Transformative constitutionalism) – వలసానంతర ప్రయోగం** | |
| | మూలం : ఇందిరాజయసింగ్, అనువాదం : రమాసుందరి | 42 |
| 7. | **ఇండియా రాజ్యాంగం – నాడు – నేడు** | |
| | – అరుణాంక్ లత | 55 |
| 8. | **భారత రాజ్యాంగ నిర్మాణంలో నారీమణులు** | |
| | – యం.వి. భరతలక్ష్మి, | 58 |
| 9. | **భారత రాజ్యాంగం కోసం ఒక పలవరింత!** | |
| | – డాక్టర్ నూకతోటి రవికుమార్ | 69 |
| 10. | **సంవిధానం – సంవాదం** | |
| | – గరిమెళ్ళ నారాయణ | 77 |
| | **రాజ్యాంగ స్ప్రహ ప్రజల్లో కలిగించడానికి జరుగుతున్న కొన్ని ప్రయత్నాలు** | 79 |
| | ముగింపు | 80 |

# ప్రస్తావన

పదేళ్ళక్రితం 2010లో **'అరాజకత్వ అధ్యయన కేంద్రం' (Centre for Anarchist Studies)** పేరుతో కార్యక్రమాలకి ఒక ప్రాథమిక రూపం ఇచ్చేనాటికి అలాంటి సంస్థ రాష్ట్రం మాటటుంచి దేశంలో కూడా ఎక్కడా ఉన్నట్లు నేను వినలేదు. అప్పుడే 'వ్యక్తిత్వం - అరాజకత్వం', 'మతం-రాజ్యం-మనిషి', వంటి కరపత్రాల్ని PRAJA (Peoples Revolutionary Anarchist Judicial Association) పేరిట ప్రచురించడం జరిగింది. వందేళ్ళకి పూర్వం గదర్‌పార్టీ వ్యవస్థాపకుడు లాలా హర్‌దయాళ్ స్థాపించిన "బకునిన్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ కాలిఫోర్నియా" ప్రపంచంలోనే మొట్టమొదటి అరాజకత్వ ఆశ్రమం. తర్వాతి కాలంలో మానవేంద్రనాధరాయ్ రాడికల్ హ్యూమనిస్ట్‌గా పరిణితి చెందే క్రమంలో అనార్కోసిండికలిస్టుల్ని కల్సి చర్చించినట్లు తెలుస్తోంది. ఇక భారతదేశ సాంఘిక, రాజకీయ, సాంస్కృతిక రంగాల్లో బుద్ధుడు, గాంధీ, లోహియా, అంబేద్కర్, పెరియార్‌ల ధోరణి అనార్కిజానికి సంబంధించినదే. తెలుగులో దరిశి చెంచయ్యగారు హర్‌దయాళ్ స్ఫూర్తితో జీవితాంతం క్రియాశీలంగా పనిచేయగా గాంధేయవాదులు, రాయిస్టులు, సోషలిస్టులు రాజ్యాధికారమనే దానిని ప్రజల సారధ్యంలో సాగే సమిష్టి నిర్మాణంగా భావించి, ఆ మార్గంలో మలచడానికి కృషి చేసినవారు ఉన్నారు. చెంచయ్యగారి ఆత్మకథ 'నేనూ - నాదేశం'లో హరదయాళ్ గురించిన విషయాలు ఉన్నాయి. ఇక తెలుగు సాహిత్యంలో 30 సం॥ల క్రితం ప్రకటించిన హే మార్కెట్ చరిత్ర 'మే, 1886- ఉరికొయ్యలు - చెరసాలలు' (హెచ్‌బిటి ప్రచురణ). అలాగే చంద్రశేఖర్ ఎంతో కృషి చేసి రాసిన 'శాక్కో-వాంజెట్టి' గ్రంథము (పరస్పెక్టివ్స్ ప్రచురణ), తప్ప అనార్కిజం పేరిట సంస్థ ఏదీ ఉన్నట్టు నాకు తెలియదు. 1920లో తాష్కెంటులోనూ, 1925లో కాన్పూరులోనూ భారత కమ్యూనిస్టు పార్టీ ఏర్పడింది. 2020కి ఆ భావజాలం ఈ దేశంపై ప్రభావం చూపి 100 సం॥రాలౌతోంది. ఆ సందర్భంగా విభిన్న వామపక్ష శ్రేణులకు ఈ విషయం చెప్పి సక్రియాత్మక కార్యక్రమాలు చేయమని చెప్పాను. విభేదాలు ఎన్నున్నా మానవీయ భావజాలాన్ని బతికించుకోవడం అవసరమని నా భావన. రాజ్యాంగబద్ధమైన దేశంలో ముప్పై సంవత్సరాలకి పైబడి పౌరసత్వాన్ని అనుభవిస్తున్న వ్యక్తిగా ఈ తరంలోఅనేక పరిమితులతో చేస్తోన్న అతిచిన్న ప్రయత్నాలు నావి. 23 సం॥రాల వయసులో చేసిన పనికి ఈరోజు సమర్థింపులు వెతికిపెట్టడం నా ఉద్దేశం కాదు. భావజాల పరిణితికి ఉపకరించిన ఉద్యమదశల్ని ప్రస్తావించుకోవడం ఊసుపోకకాదు. 70 సం॥రాల రాజ్యాంగంపై ఈ సంకలన సమీక్ష అందుకే, సంవిధానంలో సకల జనుల ప్రాతినిధ్యానికి సరైన మదింపు కోసం, సమానత్వం కోసం!

---

# 1. ఈ సంకల్పం ఎందుకంటే...

**– గౌరవ్,** సామాజిక కార్యకర్త,
పిఠాపురం, సెల్ : 9032094492

*“స్వాతంత్ర్య సాధన రాజ్యాంగం గురించిన మన దూరదృష్టినీ, అవగాహననూ మసకబార్చింది. అప్పుడప్పుడే పుట్టిన భారత రాజ్యం ఒక వికలాంగ శిశువుగా జన్మించింది. రాజ్యాంగంలోని ప్రవేశికలో స్పష్టమయిన వ్యక్తీకరణ పొంది రాజకీయ స్వాతంత్ర్యం ద్వారా మనం సాధించలేకపోయినవేవో మన రాజ్యాంగ ఆదర్శాలుగా రాసుకున్నాం. రాజ్యాంగ రచన జరిగి దశాబ్దాలు గడిచిన తర్వాత కూడా ఈ దేశంలోని అగ్రవర్ణాల వాళ్ళు సామాజిక ఆధిపత్యానికి తమకు ఉన్న హక్కును వదులుకోవడం లేదు.”*

– కె.జి. కన్నాభిరాన్, 24 గంటలు

ఈ దేశంలో అమానవీయమయిన స్మృతులు రాజ్యాంగాలుగా అమలయిన కాలం ఒకటుండేది. అయితే, స్వాతంత్ర్యానికి ముందే భారత సంవిధాన రూపకల్పనా క్రమం ఊపందుకుని 1895లోనే భారత రాజ్యాంగ బిల్లు రూపొందింది. స్వరాజ్ బిల్లుగా పిలువబడే ఈ పత్రాన్ని బాలగంగాధర్ తిలక్, అనిబీసెంట్ ప్రభావితం చేసారనే వాదనుంది. తదుపరి లార్డ్ మింటో, లార్డ్‌జాన్‌మోర్లే సంస్కరణలుగా పిలవబడే ఇండియన్ కౌన్సిల్ యాక్ట్ 1909, తదనంతరం ఆలిండియా కాంగ్రెస్ – ఆలిండియా ముస్లింలీగ్ సంయుక్తంగా రూపొందించిన స్వపరిపాలనా ఒప్పందం – 1916, ఆ వెంటనే జరిగిన మోంటాగ్ – చెల్మ్స్‌ఫోర్డ్‌ల భారత్ ప్రభుత్వ చట్టం – 1919 వరకూ ఒకానొక రాజ్యాంగ రూపకల్పన దిశగా సాగిన ప్రయత్నాలే. అదక్కడితో ఆగలేదు. భగత్‌సింగ్ ప్రభృతుల్ని ప్రభావితం చేసిన ‘హిందుస్తాన్ సోషలిస్ట్ రిపబ్లికన్ అసోసియేషన్’ 1925లో రాంప్రసాద్ బిస్మిల్ సారధ్యంలో సంపూర్ణ స్వరాజ్యాన్ని కాంక్షిస్తూ తన ఆశయాల్ని ప్రచురించింది. అదే కాలంలో, కామన్వెల్త్ సమావేశం కూడా నేషనల్ కన్వెన్షన్ ఆఫ్ ఇండియా బిల్లుని ప్రవేశపెట్టింది. తదనంతరం సైమన్ కమిషన్‌కి వ్యతిరేకంగా భారత్ స్వయంప్రతిపత్తిని ప్రకటిస్తూ రూపొందించిన నెహ్రూ నివేదిక 1928, వెంటనే లార్డ్ ఇర్విన్ చేసిన డిక్లరేషన్ 1929, కాంగ్రెస్ పిలుపిచ్చిన సంపూర్ణ స్వాతంత్ర్య ప్రకటన – 1930, కరాచీ తీర్మానం – 1931, గాంధీ – అంబేద్కర్‌ల మధ్య జరిగిన పూనా ఒప్పందం – 1932 వరకూ ఒక దశ.

అయితే 1935 బ్రిటీష్ పార్లమెంటు చేత ఆమోదించబడి 1937 నుండి అమల్లోకి వచ్చిన భారత ప్రభుత్వ చట్టం చాలా విస్తృతమైంది. భారత కమ్యూనిస్టు పార్టీ స్థాపకుడిగా,

రాడికల్ డెమోక్రటిక్ పార్టీ సారథిగా ఉన్న ఎం.ఎన్. రాయ్ 1944లో డ్రాఫ్ట్ కాన్స్టిట్యూషన్ ఫర్ ఫ్రీ ఇండియా అని రాజ్యాంగమనే పేరిట మొట్టమొదటిసారిగా ఒక చిత్తుప్రతిని తయారుచేసాడు. బొంబాయిలో జరిగిన ఆర్.డి.పి. (రాడికల్ డెమోక్రటిక్ పార్టీ) సమావేశంలో దీనిని సభ్యులంతా ఏకగ్రీవంగా ఆమోదించారు. అదే కాలంలో 'కాంగ్రెస్ మరియు గాంధీ అంటరానివారికి ఏం చేసార'నే పుస్తకానికి అనుబంధంగా అంబేద్కర్ అఖిల భారత షెడ్యూల్డ్ కులాల సమాఖ్య వర్కింగ్ కమిటీ రూపొందించిన డిమాండ్లను చేర్చారు. 'స్టేట్స్ మైనారిటీస్' అనే గ్రంథంలో కూడా అంబేద్కర్ ఈ అంశాలు చర్చించారు. ఇదే కాలంలో గాంధేయ భావాలతో ప్రభావితమైన శ్రీమాన్ నారాయన్ అగర్వాల్ 1946లో 'గాంధియన్ కానిస్టిట్యూషన్ ఆఫ్ ఇండియా' రాసి ప్రకటించాడు. గాంధీ దీనికి ముందుమాట రాసారు. సప్రూ కమిటీ చేసిన రాజ్యాంగ నివేదికలు కూడా దాదాపు అప్పుడే వచ్చాయి. ఔట్‌లైన్ ఆఫ్ న్యూ కానిస్టిట్యూషన్  పేరిట బి.ఎన్. రావు గొప్ప కృషి చేసారు. తర్వాత కేబినెట్ మిషన్ ప్లాన్‌లో భారత రాజ్యాంగానికి సంబంధించిన చర్చ ఉంది. 1947లో మణిపూర్ రాష్ట్ర రాజ్యాంగ చట్టం ఏర్పడింది. 1948లో జయప్రకాశ్ నారాయణ్ భావాలతో ప్రభావితమైన బృందం డ్రాఫ్ట్ కానిస్టిట్యూషన్ ఆఫ్ రిపబ్లిక్ ఆఫ్ ఇండియాని, సోషలిస్ట్ పార్టీ ఆఫ్ ఇండియా రూపొందించింది. అటు పిమ్మట రాజ్యాంగ డ్రాఫ్టింగ్ కమిటీ - 1948 ఏర్పడింది. నేడు ఉన్న రాజ్యాంగం అమల్లోకి 1950లో వచ్చింది. ఈ రాజ్యాంగం అమల్లోకి వచ్చి 70 సం॥రాలు అయిన సందర్భంగా ఈ చిన్ని సంకలనం ప్రచురించబడుతోంది. విభిన్న భావాలకి చోటు కల్పించడమే లక్ష్యంగా ఇది మీ ముందుకిలా తీసుకురావడం జరుగుతోంది. మతతత్వాన్ని కాదని, లౌకికత్వంతో కూడిన మానవత్వంవైపు ఈ దేశం మొగ్గి 70 ఏళ్ళవుతుంది. ఈ క్రమంలో దేశంలో రోజురోజుకీ కులతత్వం, మతోన్మాదం, పురుషాధిపత్యం, ధనిక వర్గాల దోపిడీ, సామ్రాజ్యవాద యుద్ధకాంక్ష పెట్రేగిపోతున్నాయి. విద్యార్థుల ఆత్మన్యూనత, యువత పరాధీనత, అన్నదాతల ఆత్మహత్యలు, మహిళలపై అత్యాచారాలు, దళిత బహుజన ఆదివాసీ మైనార్టీలందరిపై విద్వేషపు దాడులు జరుగుతున్నాయి. అవినీతి, బంధుప్రీతి, అక్రమాలు, నేరాలు పెరిగిపోతున్నాయి. ఇలాంటి సంక్లిష్ట పరిస్థితుల్లో విలువల ప్రాతిపదికగా నైతికతే గీటురాయిగా పాలనా విధానాలకి కొత్త జవసత్వాలనిచ్చే పారదర్శకతతో కూడిన ప్రజాతంత్ర వ్యవస్థ దిశగా పౌరచైతన్యాన్ని, సామాజిక స్పృహను మళ్ళించడం మన కర్తవ్యం. అందులో భాగమే ఈ యత్నం. ఇది చదివాక దేశంకోసం తోచినంతలో పాటుపడాలని ఏ ఒక్కరైనా అంతరాత్మలో నిజాయితీగా తీర్మానించుకొన్నా ఈ కార్యానికి సార్థకత చేకూరినట్లే.

వ్యాసకర్తలకు, సహకరించిన మిత్రులకు ధన్యవాదాలు.

విమర్శలకు ఆహ్వానం.

---

# 2. "భారతదేశ ప్రజలమైన మేము..." భారత రాజ్యాంగం - ఓ పరిశీలన

– డా॥ **అవధానం రఘు కుమార్,** గాంధీ స్టడీ సెంటర్,
హైదరాబాద్, సెల్ : 9441015709

ఒక దేశపు రాజ్యాంగం ఆ సమయంలో ఆ దేశపు ప్రజల ఆలోచనలని, తమ తమ సమాజాన్ని ఎలా నడుపుకుందామని ప్రజలు సమాజంగా మారారో ఆ సామాజిక సంఘటనల కనీస సూత్రాలను ప్రతిబింబిస్తుంది. అయితే సాధారణంగా రాజ్యాంగాలకి, ప్రత్యేకమైన చట్టాలు – ఉదా॥ నేరస్మృతి, ఆస్తి చట్టాలు లాంటి వాటికి, మధ్య చాలా తేడా వుంటుంది. ప్రత్యేక చట్టాలలో వీలయినంత వరకు ప్రతి అంశం పొందుపరచాలనే ప్రయత్నం వుంటుంది. కానీ రాజ్యాంగం వీలయినంత వరకు సాధారణ సూత్రాలుగా, తత్కాలీన ప్రజల అవసరాల రీత్యా కొంచెం మార్పులు చేసుకోడానికి వీలు కల్పిస్తుంది. అయితే సాధారణ చట్టాల మాదిరి రాజ్యాంగం నిరంతరం మార్పులకు లోను కాదు. అది దీర్ఘకాలికంగా సమాజపు అవసరాలని దృష్టిలో వుంచుకుంటుంది. మిగతా చట్టాలన్నీ ఈ రాజ్యాంగం అనే ప్రాథమిక నియమావళికి లోబడి వుండాలన్నది రాజ్యాంగ నిపుణులు చెప్పేమాట.

రాజ్యాంగం (కాన్స్టిట్యూషన్) అనేది లాటిన్ భాషలోని "Costitutio" అనే పదం నుండి ఫ్రెంచ్ భాషలోకి వెళ్ళి, ఇంగ్లీష్‌లోకి వచ్చింది. తొలుత దీని అర్థం రాజుల ఉత్తర్వుల సంకలనాలుగా ఉన్నా, ప్రజాస్వామ్య, ప్రభుత్వాలు అవతరించడం మొదలుగా 'రాజ్యాంగం' అనేది ఆ దేశాల 'ప్రాథమిక పత్రం' (బేసిక్ డాక్యుమెంట్)గా రూపుదిద్దుకుంది. ప్రజాస్వామ్యపు ఊయలగా పేరు తెచ్చుకున్న ఇంగ్లాండ్‌కు ప్రత్యేకంగా రాజ్యాంగం అంటూ వ్రాత పూర్వకంగా లేదు. కానీ పెద్దగా ఒడిదుడుకులు లేకుండానే ఆ దేశంలో ప్రజాస్వామ్యం చాలా మేరకు నడుస్తూనే వుంది. సుమేరియన్ రాజు 'ఉరుకాగిన' దాదాపు 2300 సం॥ల క్రిందట క్రోడీకరించిన 'కోడ్ ఆఫ్ జస్టిస్' బహుశ తొలి రాజ్యాంగంగా చెప్పవచ్చునేమో! తరువాతి ముఖ్యమైన అంశం మొదటి బాబిలోనియన్ రాజ్యవంశపు వాడయిన 6వ రాజు హమ్మురబీ (క్రీ.పూ. 1792–17500) స్మృతి ఈ పరంపరలో రెండవ ముఖ్యమైన ఘట్టం. ప్రాచీన గ్రీకు నగర రాజ్యాలు కూడా కొన్ని రాజ్యాంగపు సూత్రాలని తయారు చేసుకున్నాయి.

ఈ 'రాజ్యాంగం' అనే పదం ఈ మధ్య కాలంలో అనేక సంస్థలు, సంఘాలు కూడా సాధారణంగా వాడుతూనే వున్నాయి. మొత్తంమీద ఓ ప్రజా సమూహం, దేశం,

సంస్థ, తమ సంఘటిత కార్యక్రమాలకి ఆధారంగా ఈ పదాన్ని వాడటం మనకు తెలిసిన విషయమే. అమెరికా రాజ్యాంగాన్ని (1789) మొదటి సంపూర్ణ వ్రాత పూర్వక ఆధునిక రాజ్యాంగంగా మనం తీసుకోవచ్చును. 1848 ప్రాంతం నుండి యూరోప్‌లో జరిగిన స్వపరిపాలన ఉద్యమాలు అనేకమైన క్రొత్త రాజ్యాంగాలకి జన్మనిచ్చాయి. తత్కాలీన రాజకీయ చరిత్రలో భారత రాజ్యాంగం 1,45,000 పదాలతో అతి పెద్దది. మోనాకో రాజ్యాంగం 3,800 పదాలతో అతి చిన్నది అని అంటారు.

ప్రపంచ దేశాల రాజ్యాంగాలలో భారత రాజ్యాంగం అత్యంత ప్రత్యేకమైనది, అత్యంత విశిష్టమైనది. భారత రాజ్యాంగం గురించి చర్చ రాగానే కొంతమంది పెదవి విరిచే వారున్నారు, కొంతమంది దాన్ని మార్చే ప్రయత్నం ఎవరైనా చేస్తే తీవ్రంగా వ్యతిరేకించేవారూ వున్నారు. పెదవి విరిచేవారు – భారత రాజ్యాంగం అనేక దేశాల రాజ్యాంగాల ముఖ్య విషయాల కలయికగా, లేదా అవసరానికి మించి ఎక్కువగా వివరణలు, అధికరణలు కలిగిన డాక్యుమెంట్‌గా లేదా ఫ్లెక్సిబిలిటీకి అవకాశం లేని విషయంగా విమర్శిస్తారు. ముఖ్యంగా రాజ్యాంగంలోని నాలుగవ భాగం – 'ఆదేశిక సూత్రాలు' అనవసరమైన భాగంగా విమర్శించేవారు వున్నారు. మిగిలిన కొంతమంది ఎప్పుడు రాజ్యాంగ సమీక్ష ప్రస్తావన వచ్చినా తీవ్రంగా విమర్శించి దాన్ని ఓ పవిత్ర గ్రంథంగా, ఎట్టి పరిస్థితులలోనూ మార్పుకు  గురికాకూడని విషయంగా స్పందిస్తూ వుంటారు. వీటన్నిటికి అదనంగా 24.04.1973న భారతదేశ అత్యున్నత న్యాయస్థానం 'కేశవానంద భారతి' కేసులో ((1873)4ఎస్‌సిసి 225) ఇచ్చిన తీర్పులో "ప్రాథమిక నిర్మాణం" (బేసిక్ స్ట్రక్చర్) అనే అంశాన్ని తెరమీదికి తెచ్చింది. పదకొండు మంది సభ్యుల ధర్మాసనం రాజ్యాంగపు 'ప్రాథమిక నిర్మాణం'ని మాత్రం 368వ అధికరణ క్రింద మార్చడానికి వీలు లేదని చెప్పింది. అయితే 'ప్రజల ప్రాథమిక హక్కులు' (ఫండమెంటల్ రైట్స్) ప్రాథమిక నిర్మాణంలో భాగమా – అన్న అంశంపై మాత్రం స్పష్టత ఇవ్వలేదు. ఒక దేశపు రాజ్యాంగంలో ప్రజల ప్రాథమిక హక్కులు మినహాయించి, 'ప్రాథమిక నిర్మాణం' గురించి చెప్పడం కొంత సంశయాత్మకమే! ప్రపంచ రాజ్యాంగాలన్నింటిలో ప్రాథమిక హక్కులు ప్రాథమిక నిర్మాణంలో భాగమే!

**1. భారత రాజ్యాంగ నిర్మాణం – ప్రత్యేకతలు :**

ప్రపంచ రాజ్యాంగ చరిత్రలలో ఇంత విస్తృతంగా, బహిరంగంగా, ప్రజాస్వామికంగా చర్చలకు గురియై రూపుదిద్దుకున్న రాజ్యాంగం మరొకటి లేదు. ఎన్ని ఒడిదుడుకులు ఎదురైనా సభ్యులంతా ఓ పవిత్ర కార్యక్రమం చేస్తున్నట్టుగా, చారిత్రక బాధ్యతని

నిర్వహిస్తున్నట్లుగా, ఓ యజ్ఞంలా నిర్వహించిన ఆ కార్యక్రమంలో ఆనాడు బలంగా వున్న దాదాపు అన్ని రాజకీయ అభిప్రాయాలు చర్చకు వచ్చాయి. ప్రతి అధికరణ తీవ్రమైన చర్చలకు గురైంది, ప్రతి సభ్యుడు నిష్కర్షగా అభిప్రాయాలు వ్యక్తీకరించారు. ప్రతి చర్చించిన అంశం దేశమంతటా చర్చకు గురైంది. ఇది ఓ అద్భుతమైన సమిష్టి కార్యం. అధికారికంగా కమ్యూనిస్ట్‌లు, సోషలిస్టులు, హిందూవాదులు పాల్గొనడానికి నిరాకరించినా పరోక్షంగా అన్ని ఆలోచనలను ప్రతిఫలించేవారు సభలో సభ్యులుగా వున్నారు. నిజానికి రాజ్యాంగ పరిషత్‌కు అధికారికంగా దూరంగా వుండటం అనేది కమ్యూనిస్ట్‌ల, సోషియలిస్ట్‌ల, హిందూ వాదుల అసంగతమైన ఆలోచనని ప్రతిబింబిస్తుందే కాని, రాజ్యాంగ పరిషద్, దానిని నిర్వహించినవారు, ఏదో ఒక విధంగా వారిని సభలోనికి ఆహ్వానించి వారి అభిప్రాయాలని కూడా పరిగణలోకి తీసుకోవడం జరిగింది. వ్యతిరేకుల అభిప్రాయాలని గౌరవించడం అనేది భారత రాజ్యాంగ పరిషద్ చేసిన అద్భుత విన్యాసం.

ఉదాహరణకి – అమెరికా రాజ్యాంగ సమావేశం (1787) రాజ్యాంగ నిర్మాణానికి తొలిసారిగా జరిగినప్పుడు వాళ్ళు తీసుకున్న నిర్ణయాలు చాలా విచిత్రమైనవి. మొత్తం రాజ్యాంగ చర్చలన్నీ తలుపులు మూసుకొని, రహస్యంగా జరపాలనీ, లోపల జరిగే చర్చల సారాంశం బయట సామాన్య ప్రజానీకానికి ఎవ్వరికీ తెలియకూడదని నిర్ణయించుకున్నారు. పూర్తిగా సిద్ధమైన రాజ్యాంగ ప్రతి 1789లో బయటకి వచ్చేదాకా లోపలి చర్చలేమిటో ఎవరికీ తెలియవు. సభ లోపల ఇది సభ్యులకి ఎక్కువ స్వేచ్ఛని ఇచ్చినట్టుగా చెప్పుకున్నా, భావితరాలకి లోపల ఏం జరిగిందో తెలియకపోవడం అత్యంత శోచనీయం. దీనికి పూర్తిగా విరుద్ధంగా మన రాజ్యాంగ పరిషద్‌లో ప్రతి అంశం, ప్రతి చర్చా బహిరంగం. ప్రతి సభ్యుడు మాట్లాడిన మాటలు, చర్చల సారాంశం 'రాజ్యాంగ పరిషద్ చర్చలు' (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ డిబేట్స్)గా వ్రాత పూర్వకంగా నమోదు చేయబడ్డాయి. అన్నీ బహిరంగ పుస్తకాలుగా లభ్యమౌతున్నాయి. అంతేకాదు, సభ్యులు కాని సాధారణ ప్రజానీకం కూడా ప్రేక్షకుల గ్యాలరీలో కూర్చుని చర్చలని పర్యవేక్షించే అవకాశం ఇచ్చారు.

ప్రత్యక్ష ఎన్నికలు అనే ఈ ఆధునిక అర్థంలో కొంత తేడా వున్నా, రిస్ట్రిక్టెడ్ వోటింగ్ ద్వారా సభ్యులు ఎన్నుకోబడ్డా, ప్రజాస్వామ్య ఆశయాలకి అత్యంత దగ్గరగా రిప్రెసెంటేషన్ కలిగినది మన భారత రాజ్యాంగ పరిషద్. 292 మంది ప్రాంతీయ చట్టసభల (ప్రొవిన్షియల్ కౌన్సిల్స్) నుండి, (బెంగాల్ ప్రెసిడెన్సీ, బాంబే ప్రెసిడెన్సీ, ఉత్తర – పశ్చిమ ప్రెసిడెన్సీ నుండి) 93 మంది రాజరిక రాష్ట్రాల నుండి (ప్రిన్సిలీ స్టేట్స్), 4

సభ్యులు ప్రత్యేక పాలక మండళ్ళు (ఢిల్లీ, అజ్మీర్, కూర్గు....) మొత్తం 389 మంది సభ్యులు. ప్రధాన పార్టీ అయిన కాంగ్రెస్ – 208, ముస్లింలీగ్ – 73, ఇతరులు – 15. ముస్లింలీగ్ రాజ్యాంగ పరిషద్‌ని బహిష్కరించాక సవరించినసభ్యుల సంఖ్య – 299.

ఈస్ట్ పంజాబ్ (లేదా ప్రస్తుత పంజాబ్) నుండి – 14 మంది, బీహార్ ప్రాంతం నుండి – 39 మంది, సెంట్రల్ మరియు బేరార్ ప్రాంతం నుండి – 39 మంది, అస్సాం (ఈశాన్య రాష్ట్రాలు) నుండి – 8 మంది, ఒరిస్సా నుండి – 8 మంది, ఢిల్లీ – 1, అజ్మీర్ – మేర్వార్ – 1, కూర్గ్ – 1, మైసూర్ – 7, జమ్ము కాశ్మీర్ – 4, ట్రావెన్‌కోర్–కొచ్చిన్ – 7, మధ్య భారతం – 7, సౌరాష్ట్ర – 5, రాజస్థాన్ – 11, పాటియాల – 3, బాంబే – 8 ... దాదాపు పది లక్షల మందికి ఒకరు ఉండేలా ప్రయత్నం జరిగింది. అప్పటికి ఉన్న చట్టాల మేరకు కేవలం 28.5 శాతం వయోజనులకే ఓటు హక్కు వున్నా, కాంగ్రెస్ పార్టీ ప్రత్యేక శ్రద్ధ తీసుకుని అనేక ప్రాంతాల, వర్గాల ప్రాతినిధ్యం ఉండేలా చర్య తీసుకుంది. చివరిగా రాజ్యాంగ పరిషద్ సభ్యత్వం పని పూర్తి అయ్యే నాటికి దానిలో 35% (235లో 88 మంది) బలహీన వర్గాల ప్రాతినిధ్యం వుంది. పదిహేను మంది స్త్రీలు (రాజకుమారి అమృతకౌర్, సరోజినీ నాయుడు, సుచేతా కృపలాని, దుర్గాభాయ్ దేశ్‌ముఖ్, విజయలక్ష్మి పండిత్ తదితరులు) పాల్గొన్నారు.

09–12–1946 నుండి 24–01–1950ల మధ్య కాలాల్లో రాజ్యాంగ పరిషద్ పనిచేసిన రోజులు – 2 సం॥ 11 నెలల 18 రోజులు మొత్తం 166 రోజులు. 12 సమావేశాలు, 22 కమిటీలు. అందులో ముఖ్యమైనవి ముసాయిదా కమిటీ (డా॥ బి.ఆర్. అంబేద్కర్), కేంద్ర అధికారుల కమిటీ (జవహార్‌లాల్ నెహ్రూ), ప్రాంతీయ రాజ్యాంగ కమిటీ (సర్దార్ పటేల్), ప్రాథమిక, మైనారిటీ, తెగల, ప్రత్యేక ప్రాంతాల హక్కుల కమిటీ – (పటేల్), విధానాల కమిటీ (డా. రాజేంద్ర ప్రసాద్), రాష్ట్ర ప్రభుత్వాల కమిటీ (నెహ్రూ), స్టీరింగ్ కమిటీ (డా. రాజేంద్ర ప్రసాదు). దాదాపు అందరు సభ్యులూ ప్రతి చర్చలోనూ చాలా గంభీరంగా పాలు పంచుకున్నారు. కానీ డ్రాఫ్టింగ్ కమిటీ ఛైర్మన్‌గా అంబేద్కర్, రాజ్యాంగ పరిషత్ సలహాదారుడుగా బి.ఎన్. రావు, ప్రధాన మంత్రిగా నెహ్రూ, ఉపప్రధాని మరియు హోమ్ మినిస్టర్‌గా పటేల్, విద్యాశాఖా మంత్రిగా మౌలానా అబ్దుల్ కలామ్ ఆజాద్, రాజ్యాంగ పరిషద్ అధ్యక్షుడిగా రాజేంద్ర ప్రసాద్, గవర్నర్ – జనరల్‌గా చక్రవర్తి రాజగోపాలాచారి, బారిష్టర్‌గా – క్రియాశీలక రాజకీయ నాయకుడిగా శరత్ చంద్రబోస్ చాలా క్రియాశీలక పాత్ర తీసుకున్నారు. వీళ్ళే కాక, సభ సభ్యులకి సహాయం చేయడానికి చాలామంది సీనియర్ సివిల్ అధికారులు కూడా పనిచేశారు. కాంగ్రెస్

పార్టీ సభ్యులు 82% (అంటే ముస్లింలీగ్ బహిష్కరించాక, అంతకు ముందు కాంగ్రెస్ 69%) అయినా అనేకమంది కాంగ్రెసేతరులని కాంగ్రెస్ పార్టీ హై కమాండ్ ఆదేశంపై ఎన్నుకున్నారు – అందులో ప్రముఖులు డా. అంబేద్కర్, అల్లాడి క్రిష్ణస్వామి అయ్యర్, హెచ్.ఎం. కుంజ్రూ, కె.ఎమ్. మున్షీ, శ్యాంప్రసాద్ ముఖర్జీ ఇలా కాంగ్రెస్ ఆలోచనలతో విభేదించే వారు కూడా ప్రముఖ పాత్ర వహించారు.

రాజ్యాంగ పరిషద్ ఎలాంటి హొడిదుడుకులు లేకుండా వీలయినంత మృదువుగా, ప్రశాంతంగా సాగిపోవడంలో నలుగురు – నెహ్రూ, పటేల్, రాజేంద్రప్రసాద్, ఆజాద్‌ల పాత్ర మరువలేనిది. గత కొద్ది కాలం క్రితం నుండి మనం నేపాల్ రాజ్యాంగ పరిషద్ ఎదుర్కొంటున్న సమస్యలని చూశాం. కానీ ఈ నలుగురు తమ పెద్దరికంతో, సమయస్ఫూర్తితో ఎప్పటికప్పుడు వివాదాలని పరిష్కరిస్తూ, నిర్దిష్ట సమయంలో పని పూర్తి అయ్యేలా చేశారు. వీరిని ఓలిగార్చి (పెద్ద మనుషులు) అని అనధికారికంగా ప్రశంసించేవారు. ముఖ్యంగా 20% మంది సభ్యులు చాలా క్రియాశీలకంగా భాగం పంచుకున్నారు. నెహ్రూ, పటేల్, రాజేంద్రప్రసాద్, ఆజాద్ కాక అంబేద్కర్, పంత్, సీతారామయ్య, అల్లాడి కుప్పుస్వామి అయ్యరు, గోపాలస్వామి అయ్యంగార్, మున్షీ, సత్యనారాయణ సిన్హా, ఎమ్.ఎ. అయ్యంగార్, జై రాందాస్ దౌలత్‌రామ్, శంకరరావ్ దేవ్, దుర్గాభాయి, కృపలాని, టి.టి. కృష్ణమాచారి, హెచ్.సి. ముఖర్జీ, ఎన్.ఎమ్. రావు, మొహమ్మద్ సాధుల్లాలు చాలా చురుకుగా పాల్గొన్నారు. ఈ ఇరవై శాతం మందినీ గమనిస్తే – అందరూ యూనివర్శిటీ పట్టభద్రులు. అందులో నలుగురు విదేశాల్లో ఉన్నత చదువులు చదువుకున్నవారు. 12 మంది లాయర్లు, ఒక మెడికల్ డాక్టర్, ఇద్దరు టీచర్లు, ముగ్గురు ఉన్నత పదవుల్లో ఉన్న అధికారులు, ఒక వ్యాపారవేత్త, ఇద్దరు ముస్లిములు, ఒక క్రిస్టియన్. ఇక మిగిలిన హిందూ సభ్యులలో (ఈ ఇరవై మందిలో) ఒకరు ఎస్సీ, 9 మంది బ్రాహ్మణులు, ఏడుగురు – బ్రాహ్మణేతరులు.

ముఖ్యంగా మనం బి.ఎన్. రావు గురించి తెలుసుకోవాలి. వీరు రాజ్యాంగ పరిషద్ సభ్యులు కాదు. కానీ రాజ్యాంగ సభకు సలహాదారులు. వీరి సలహాలు, సూచనలు చాలా ప్రభావశీలంగా వుండేవి. సర్ బెనెగల్ నార్సింగ్‌రావు గొప్ప సివిల్ అధికారి, న్యాయకోవిదుడు, డిప్లొమాట్, రాజనీతిజ్ఞుడు. వీరు బర్మా రాజ్యాంగ నిర్మాణంలో కూడా సహాయం చేశారు. జమ్ము–కాశ్మీర్‌కి కొంతకాలం ప్రధాన మంత్రిగా (1944–45) పని చేశారు. భారత స్వాతంత్ర్యం తరువాత యు.ఎన్.ఓ. సెక్యూరిటీ కౌన్సిల్‌లో ఇండియా ప్రతినిధి. భారత రాజ్యాంగపు ప్రధమ ప్రతిని (ఫస్ట్ డ్రాఫ్ట్) తయారుచేసి రాజ్యాంగ సభకి

ఫిబ్రవరి 1948న అందజేసారు. ఈ ప్రతినే సభ చర్చించి, మార్పులు చేసి అంగీకరించింది. దీనిలో భాగంగా ఆయన అమెరికా, కెనడా, ఐర్ల్యాండ్, ఇంగ్లాండ్‌లు వెళ్ళారు. అక్కడి న్యాయమూర్తులు, న్యాయ కోవిదులు, మేధావులని రాజ్యాంగ నిపుణులని సంప్రదించారు. అంబేడ్కర్‌గారు డ్రాఫ్ట్ కమిటీని ఏర్పాటు చేసిన రిజల్యూషన్‌లో ఇలా అన్నారు. ఈ డ్రాఫ్ట్ కమిటి ఉద్దేశ్యం – "రాజ్యాంగ సభ సలహాదారుడి డ్రాఫ్ట్‌ని పరిశీలించి, ఈ సభలో తీసుకున్న నిర్ణయాలు ఫలవంతమయ్యేలా, ఇతర అనుబంధ విషయాలను కూడా చర్చించి రాజ్యాంగ సభకు రాజ్యాంగ ప్రతిని తగిన మార్పులు, చేర్పులతో అందివ్వడం."

13 మే, 1787న జార్జి వాషింగ్టన్, మిగతా 13 రాష్ట్రాల నాయకులతో ఫిలడెల్ఫియా నగరంలో కలవడాన్ని – ఫిలడెల్ఫియా కన్వెన్షన్ అంటాము. అంతకు ముందు బ్రిటీష్ సామ్రాజ్యానికి వ్యతిరేకంగా జరిగిన యుద్ధంలో (1783) ప్రధాన సైనిక నాయకుడు వాషింగ్టన్. ఆ యుద్ధం ముగిసిన తర్వాత ప్రస్తుత అమెరికాలోని 13 రాష్ట్రాలు ఓ సంఘంగా తయారయ్యాయి. కానీ 1787 నాటికి వాటి మధ్య అనేక సమస్యలు ఉత్పన్నమయ్యాయి. ఫిలడెల్ఫియా సమావేశం ఆ సమస్యల పరిష్కార దిశగా ఓ చర్చ. ఇదే ఈ వేళ అమెరికన్ రాజ్యాంగ సంఘంగా చెబుతాము. 12 రాష్ట్రాల నుండి 55 మంది నాయకులు వాటికి ప్రతినిధులుగా హాజరయ్యారు. రోడ్ ఐలాండ్ తరఫున మాత్రం ఎవరూ పాల్గొనలేదు. అమెరికాలోని అన్నిరకాల భావజాలాలు ఉన్నవారు, వామపక్ష భావాలు ఉన్న వారితో సహా, వారి రాజ్యాంగాన్ని చాలా పవిత్రమైన, అద్భుతమైన ప్రక్రియగా భావిస్తారు. జేమ్స్ మాడిసన్, జేమ్స్ విల్సన్, బెన్ ఫ్రాంక్లిన్, జనరల్ జార్జి వాషింగ్టన్, గవర్నర్ మారిస్... ఇలా అనేక మంది దాని రూపకల్పనలో పాల్గొన్నారు. వారెవరూ ప్రత్యక్ష ఎన్నిక ద్వారా రాలేదు, కానీ అమెరికన్ రాజ్యాంగం అంటే ఆ ప్రజలకి చాలా గౌరవం.

ఇక రష్యా విషయానికి వద్దాం. అక్టోబర్ విప్లవం (1917) తరువాత 1918లో మొదటి రష్యన్ రాజ్యాంగం అమలులోకి వచ్చింది. శ్రామికులని పరిపాలకులుగా గుర్తించింది. అది కూడా శ్రామికవర్గ నియంతృత్వంగా! "మనుషులు, మనుషుల్ని దోచుకోవడం రద్దు, మనుషుల్ని వర్గాలుగా విభజించడం రద్దు, దోచుకునే వాళ్ళని అణచివేసి, సమసమాజ స్థాపన" – దీని ఉద్దేశ్యం. 10 జూలై 1918న కాంగ్రెస్ ఆఫ్ సోవియట్స్ దీనిని అంగీకరించి, వాడుకలోకి తీసుకువచ్చింది. ట్రీటి ఆన్ ది క్రియేషన్ ఆఫ్ ది యుఎస్ఎస్ఆర్ 1922 అధికారికంగా యుఎస్ఎస్ఆర్‌కి జన్మనిచ్చింది. తిరిగి 1924 న సోవియట్ రాజ్యాంగంగా ఇది రూపుదిద్దుకుంది. మళ్ళీ 1936లో ఇంకో రాజ్యాంగం – దీనిని "స్టాలిన్ రాజ్యాంగం" అని కూడా అంటారు. ఇది పార్టీ (కమ్యూనిస్ట్ పార్టీ)కి ప్రధానమైన అధికారాల్ని కట్టబెట్టింది. మళ్ళీ 1977 లో మరో రాజ్యాంగం –

దీనిని బ్రెజ్నెవ్ రాజ్యాంగం అంటారు. 1993 లో రష్యా ఫెడరేషన్‌గా మారాకా ఫెడరేషన్ రాజ్యాంగం 25 డిసెంబర్, 1993లో వచ్చింది. రష్యన్ రాజ్యాంగ నిర్మాణానికి ప్రత్యక్షంగా ఎన్నుకున్న డెలిగేట్స్ లేరు. పార్టీ లేదా అధినేత ఎంపిక చేసిన వ్యక్తులు సభ్యులు. అయినా రష్యన్ ప్రజలు ఆ రాజ్యాంగాన్ని గౌరవించారు.

ఇలా మనం ఫ్రెంచ్, జర్మనీ, జపాన్ దేశాల రాజ్యాంగాలను కూడా పరిశీలిస్తే, భారత రాజ్యాంగ పరిషద్ – తులనాత్మకంగా – ఎక్కువ ప్రజాస్వామ్య విలువలని, ప్రజాస్వామ్య లక్షణాలని కలిగి వుంటుంది. 1946 నాటికి అందుబాటులో ఉన్న ఎంపిక విధానంలో, సార్వజనీక ఓటు హక్కు లేకపోయినా, రాజ్యాంగ పరిషద్ నిర్మాణాన్ని గమనిస్తే, అప్పటి కాంగ్రెస్ నాయకత్వం తీసుకున్న శ్రద్ధ, చివరికి రాజ్యాంగ పరిషద్‌లో అన్ని ప్రాంతాల, వర్గాల, భాషల ప్రజలకి ఎలా ప్రాతినిధ్యం కల్పించిందో అర్థం అవుతుంది.

1922లోనే గాంధీ – స్వాతంత్ర్యం అనేది బ్రిటిష్ దయాదాక్షిణ్యాల మీద ఆధారపడే బహుమతి కాదని, భారత దేశీయుల చేతిలోనే దేశం క్షేమంగ ఉంటుందని అన్నారు. 1934లో ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ రాజ్యాంగ నిర్మాణ సభని కోరుతూ తన అధికారిక ప్రకటన ఇచ్చింది. “ఒకే మార్గం” (ద ఓన్లీ వే) అనే శీర్షిక క్రింద గాంధీ భారత స్వాతంత్ర్యానికి రాజ్యాంగ పరిషద్ ఒక్కటే పరిష్కారం అని వ్రాశారు. (హరిజన్, 12 నవంబర్, 1939). 1942 క్రిప్స్ కమిషన్ ప్రతిపాదనలలో భారతీయులు తమ రాజ్యాంగాన్ని తామే తయారు చేసుకుంటారని చెప్పారు. డా॥ అంబేద్కర్, మొహమ్మద్ అలీ జిన్నాలు మాత్రం 1935 చట్టం సరిపోతుందనీ, రాజ్యాంగ పరిషద్ అవసరం లేదని 1945 దాకా వాదించారు.

కానీ సెప్టెంబరు 1945లో రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఏర్పడిన లెఫ్ట్ గవర్నమెంట్ రాజ్యాంగ పరిషద్ ఏర్పాటు నిర్ణయాన్ని ప్రకటించి, దానికోసం జాతీయ స్థాయిలో ఎన్నికలు నిర్వహించాలని నిర్ణయించింది. మార్చ్ 1946లో క్యాబినెట్ మిషన్ అంతిమంగా రాజ్యాంగ పరిషద్ వైపు మొగ్గు చూపింది. చివరగా 16 మే, 1946 బహిరంగ ప్రకటన ద్వారా క్యాబినెట్ మిషన్ ఈ నిర్ణయం ఓ తుది రూపు దిద్దుకుంది. అయితే కాంగ్రెస్, రాజ్యాంగ పరిషద్‌కి సభ్యుల్ని వయోజన ఓటు హక్కు ద్వారా ఎన్నుకోవాలని కోరుకున్నా – క్యాబినెట్ మిషన్ మాత్రం అప్పటి ఉన్న ఓటు హక్కు విధానం ద్వారానే ఎంపిక జరగాలని ఒత్తిడి చేసింది. కాంగ్రెస్ కూడా ఈ ప్రతిష్టంభన తొలగి, త్వరగా రాజ్యాంగ పరిషద్ ఏర్పాటవ్వాలని కోరుకోవడంతో పని మరింత సులువయ్యింది.

నిజానికి క్యాబినెట్ మిషన్ ప్లాను కూడా కేవలం హిందూ, సిఖ్, ముస్లింలకు మాత్రమే రాజ్యాంగ నిర్మాణంలో పాత్రని ఇచ్చింది. కానీ కాంగ్రెస్ తీసుకున్న చొరవ వల్ల పార్శీలు, ఆంగ్లో ఇండియన్‌లు, ఇండియన్ క్రిస్టియన్‌లు, షెడ్యూల్డ్ కులాల, తెగల ప్రతినిధులు, చివరికి స్త్రీలు కూడ జనరల్ క్యాటగిరి క్రింద ఎన్నుకోబడ్డారు. కొంతమందిని కాంగ్రెస్ ఏరికోరి మరీ సిఫారసు చేసింది. గ్రాన్‌విల్ ఆస్టిన్ ఒక చోట అంటాడు : "అసెంబ్లీలో ప్రాతినిధ్యం వహించని సామాన్య అభిప్రాయం అంటూ లేదు." కమ్యూనిస్ట్, సోషలిస్ట్ పార్టీలు హిందూ మహాసభ అధికారికంగా బహిష్కరించినా, సోమనాథ్ లాహిరీ అనే ఓ కమ్యూనిస్ట్ సభ్యుడు సభలో ఉన్నాడు. సోషలిస్ట్‌లు ఓ సంవత్సరం తరువాత జయప్రకాశ్ నారాయణ్ నాయకత్వంలో తమ నిర్ణయాన్ని మార్చుకుని, నరేంద్రదేవ్, అసఫ్ అలీ, రామ్మనోహర్ లోహియా, పురుషోత్తం క్రతికందాస్, కమలాదేవి, పట్వర్ధన్ అశోక మెహతాల పేర్లు ప్రతిపాదించినా – అప్పటికే చాలా సమయం అయిపోవడం క్రొత్త సభ్యుల సంఖ్య పెంచడం సాధ్యం కాకపోవడం వల్ల ఆ ప్రతిపాదన ఫలించలేదు. కానీ సోషలిస్ట్‌ల తప్పు విధాన నిర్ణయం వల్ల దేశ చరిత్రలోని ఓ అద్భుత సమయంలో తమ పాత్ర నిర్వహించే అవకాశాన్ని చేజేతులారా పోగొట్టుకున్నారు. అలాగే హిందు మహాసభ, రాష్ట్రీయ స్వయం సేవక్ తదితర హిందూత్వ గ్రూపుల ప్రాతినిధ్యం అధికారికంగా లేకపోయినా శ్యాంప్రసాద్ ముఖర్జీలు తమ స్వయం ప్రతిపత్తిపై అసెంబ్లీలో ప్రవేశించారు.

ఓ దేశ రాజ్యాంగం తయారు చేయడం అనేది ఆ దేశ చరిత్రలో అపురూప ఘట్టం. ఒక్కోసారి అలాంటి అవకాశం శతాబ్దములో లేదా శతాబ్దాలో కూడా తిరిగి రాకపోవచ్చును. ఈ విషయాన్ని కాంగ్రెస్, ముస్లిం లీగ్, సిక్కులు, షెడ్యూల్డ్ కులాల ఫెడరేషన్‌లు అర్థం చేసుకున్నట్లుగా మిగతా రాజకీయ సిద్ధాంతాల వారు చేసుకోలేకపోవడం తీవ్రమైన, సర్దుకోలేనిపొరపాటు, అపరిపక్వ రాజకీయాల నిదర్శనం. నిజానికి కమ్యూనిస్ట్‌లు, సోషలిస్ట్‌లు కూడా పాల్గొనివుంటే – ఆచార్య నరేంద్రదేవ్, లోహియా, అరునా అసఫాలి.. ఇలా అనేకమంది పాలుపంచుకోవడం వల్ల అది మరింత గొప్ప డాక్యుమెంట్‌గా అయ్యుండేది. అయితే ఆచార్య కృపలానీ వల్ల ఆ లోటు కొంత తీరిందని భావించవచ్చును. డా॥ అంబేడ్కర్‌కు కాంగ్రెస్, గాంధీలతో అనేక విభేదాలున్నా, గాంధీ, నెహ్రూ, స్వయంగా ఆయన్ని మంత్రి వర్గంలో సభ్యుడిగా, రాజ్యాంగ పరిషత్‌లో సభ్యుడిగా తీసుకున్నారు. దీనికి తోడు కాంగ్రెస్ పార్టీ కాంగ్రెస్ అసెంబ్లీ పార్టీ అనే ఓ అనధికారిక, ప్రత్యేక వేదికను తయారుచేసి – రాజ్యాంగ పరిషద్‌లో వచ్చిన – ప్రతి ప్రతిపాదనని దాని ద్వారా క్షుణ్ణంగా పరిశీలించి, ఆ ప్రతిపాదన అసెంబ్లీ చేరకముందే దానిని పరిష్కరించి పంపేవారు.

స్వాతంత్ర్య ఉద్యమం గాంధీజీ నాయకత్వంలో నడిచినా ఆయన ప్రతిపాదనలు ఆయన సైద్ధాంతిక ప్రాతిపదికలకు ఇటు కాంగ్రెస్ పార్టీ నాయకత్వం కానీ, చివరికి రాజ్యాంగ పరిషద్ కానీ తగినంత విలువ ఇవ్వలేదని చర్చల సారం చెబుతోంది. 1946, 1948 లలో గాంధీ "కాంగ్రెస్ పార్టీ రాజ్యాంగా" నికి రెండు ప్రణాళికలు ఇచ్చారు. స్వయం ప్రతిపత్తి గ్రామాలు లేదా గ్రామ స్వరాజ్ అనే ప్రాతిపదికన ఈ రెండు గాంధీజీ తయారు చేశారు. అయితే వర్కింగ్ కమిటి దీనికి తిరస్కరించింది. అలాగే దేశ రాజ్యాంగ నిర్మాణంలో పరిషద్‌కి శ్రీమాన్ నారాయణ అగర్వాల్ అనే గాంధీ అనుచరుడు "స్వంతత్ర్య భారతదేశానికి గాంధితత్వ రాజ్యాంగం" (గాంధీయన్ కాన్‌స్టిట్యూషన్ ఫర్ ఫ్రీ ఇండియా) అనే పేరుతో ఒక నమూనాని ఇచ్చినట్టు, అయితే రాజ్యాంగ పరిషద్ దీనిని అసలు పరిగణలోనికి తీసుకోలేదని, అమెరికా, యూరోప్ మొదలైన పాశ్చాత్య దేశాల రాజ్యాంగ స్ఫూర్తినే వారు ఉన్నతమైనవి, అవసరమైనవిగా భావించినట్టు తెలుస్తోంది.

రాజ్యాంగ పరిషద్‌లో మనకు బాగా కనిపించేది సభ్యుల మధ్య నమ్మకం, విశ్వాసం, చాలా వరకు ఇచ్చి పుచ్చుకునే ధోరణి కూడా ఎక్కువ కనబడుతుంది. కులం, మతం, ప్రాంతం అనేది రాజ్యాంగ నిర్మాణాన్ని ప్రభావితం చేసినట్టుగా కూడా మనకు ఎక్కడా కనబడదు. అందరు సభ్యులు తాము ఒక ప్రత్యేకమైన, పవిత్రమైన పని చేస్తున్నవారిగా, అలాంటి అవకాశం మళ్ళీ ఎప్పుడో కాని ఎవరికీ రాదు అన్నంత శ్రద్ధతో పని చేసినట్టూ కనపడుతుంది.

రాజ్యాంగ పరిషద్ అనుసరించవలసిన ప్రాథమిక సూత్రాలు ఖరారు అయ్యాక, ఇక అసలు రాజ్యాంగ రూపకల్పనని ప్రధానంగా రెండు విభాగాలు తీసుకున్నాయి – (1) అంబేద్కరు గారి అధ్యక్షతన ఉన్న డ్రాఫ్టింగ్ కమిటీ (2) రాజ్యాంగ సలహాదారుడు బి.ఎన్. రావు గారు. "పంచాయితీ" అనే మాట కూడా ఈ ముసాయిదాలో లేకపోవడంతో రాజేంద్రప్రసాద్ తదితరులు కొంత ఆందోళన వ్యక్తం చేశారు. అయితేపంచాయతి ప్రాతిపదికగా కంటే – కేంద్రం, రాష్ట్ర ప్రభుత్వాల ఆధారిత రాజ్యాంగమే చివరికి రూపుదిద్దుకుంది. పంచాయితీలను బలపరిచే అంశం – ఆదేశిక సూత్రాలు – (డిరెక్టివ్ ప్రిన్సిపల్స్ ఆఫ్ స్టేట్ పాలసీ), రాజ్యాంగపు నాలుగవ అధ్యాయంలో మాత్రమే చోటు చేసుకున్నాయి. ఆదేశిక సూత్రాలు కేవలం రాజ్యం యొక్క దశా–దిశా నిర్దేశం చేస్తాయే కానీ, అది రాజ్యాంగ ప్రాథమిక సూత్రం కాదు, న్యాయస్థానాలలో పోరాడి దానిని సాధించుకునే అవకాశం కూడా లేదు. కేవలం 1992లో 73వ సవరణగానే పంచాయితీలు, 1993లో 74వ సవరణగా మునిసిపాలిటీలు, కొంతమేరకు చట్టబద్ధతను సంతరించుకున్నాయి. అయితే వాటిల్లో ఎక్కడా గాంధి సిద్ధాంత ప్రాతిపదికత లేదు.

స్వయంగా నెహ్రూ యే "కాంగ్రెస్ ఎప్పుడూ గాంధీ సమాజ నిర్మాణ సూత్రాలని ఆమోదించలేదు" అని ప్రకటించారు. గాంధి సిద్ధాంత ప్రాతిపదిక కంటే సోషలిస్ట్ భావాలు రాజ్యాంగాన్ని ఎక్కువగా ప్రభావితం చేసినట్టు, ముఖ్యంగా 1946 నుండి 1948 దాకా జరిగిన అనేక రాజకీయ, సామాజిక పరిణామాలు, మత సంఘర్షణలు, ప్రిన్స్‌లీ స్టేట్స్ ప్రవర్తించిన తీరు – రాజ్యాంగ పరిషద్ మొత్తం – ఆధునిక, పాశ్చాత్య, ప్రజాస్వామ్య, ఏకీకృత, బలమైన కేంద్ర ప్రభుత్వ విధానాల వైపు మరలినట్టుగా గ్రానవిల్ ఆస్టిన్ వ్రాశారు. 26.11.1949 నాటికి రాజ్యాంగ పరిషద్ రాజ్యాంగాన్ని తుది రూపు నిచ్చి, పరిషద్‌లో స్వీకరించబడి, చట్టబద్ధమై, "మనకు మనమే" ఇచ్చుకున్న గొప్ప గ్రంథమైంది.

**2. భారత రాజ్యాంగం – దేశ సమగ్రత :**

"వుయ్ ద పీపుల్ ఆఫ్ ఇండియా…" అంటూ మొదలైన ఈ రాజ్యాంగం ప్రజలది, సార్వజనీనమైంది. మనం తయారు చేసుకుని, మనందరి ఆమోద ముద్రతో, మన ప్రభుత్వ నిర్వహణకు ప్రాతిపదిక అయ్యింది.. మొదట కేవలం "సర్వసత్తాక ప్రజా తంత్రం" (సావరిన్ డెమోక్రటిక్ రిపబ్లిక్)గా అభివర్ణించబడ్డా, 1977 సవరణ ద్వారా "సామ్యవాద, మతాతీత" పదాలు చేరి "సావరిన్ సోషలిస్ట్ సెక్యులర్ డెమోక్రటిక్ రిపబ్లిక్"గా రూపం తీసుకుంది.

ప్రస్తుతం 395 అధికరణలు, 22 భాగాలు, 12 షెడ్యూల్సుతో చాలా విస్తృతంగా వుంది. ఇప్పటికి దాదాపు వంద సవరణలకు గురి అయ్యింది. ముఖ్యంగా రాజ్యాంగపు "ప్రియాంబుల్" చాలా చర్చనీయాంశం. అలాగే మూడవ భాగమైన ప్రాథమిక హక్కులు సమాన స్వేచ్ఛ, దోపిడి వ్యతిరేకంగా హక్కు, మత స్వేచ్ఛ, సాంస్కృతిక విద్య హక్కులు ఇలా ప్రపంచ ఆధునిక ప్రజాస్వామ్యాలలో ఉండే అనేక ప్రాథమిక హక్కులు పొందుపరచబడ్డాయి. ఇదీ కాక ప్రపంచపు రాజ్యాంగాలలో చాలా వాటికి భిన్నంగా రాజ్య విధానాలపై కొంత నియంత్రణగా నాలుగవ భాగం "డిరెక్టివ్ ప్రిన్సిపల్స్ ఆఫ్ స్టేట్ పాలసీ"గా వుంది. చాలాసార్లు ఈ భాగానికి పెద్ద చట్ట బద్ధత లేనట్టుగా కనిపించినా అనేకసార్లు ఇది చట్టాల తయారీలో, న్యాయవ్యవస్థపై చాలా ప్రభావాన్ని చూపించింది.

రాజ్యాంగ సభ మన మొదటి పార్లమెంట్‌గా భావించవచ్చును. 368 అధికరణ ప్రకారం రాజ్యాంగాన్ని సవరించే హక్కు, కొన్ని నిబంధనలకు లోబడి ప్రతి పార్లమెంట్‌కూ వుంది.. అయితే అధికరణలు 54, 55, 73, 162, 241, ఐదవ భాగంలోని 4వ అధ్యాయం, ఆరవ భాగంలోని ఐదవ అధ్యాయం, ఏడవ షెడ్యూలులోని అంశాలు, పార్లమెంటులో రాష్ట్రాల ప్రాతినిధ్యం లేదా 368 నే మార్చాలనుకున్నా దేశంలోని 50 శాతం రాష్ట్రాల ముందస్తు ఆమోదం కావాలి. రెండు సభల అధిక సభ్యుల ఆమోదం

కావాలి. ఈ అంశాలు మినహా మిగతా అన్ని విషయాలలో లోక్‌సభ లేదా రాజ్యసభలలో ఈ బిల్లు ప్రవేశపెట్టవచ్చును. రెండు సభల అధిక సభ్యుల ఆమోదం, సభలో వున్న సభ్యులలో మూడింట రెండు వంతులు ఆమోదిస్తే, ఆ తరువాత రాష్ట్రపతి గారి ఆమోదంతో రాజ్యాంగ సవరణ చేయవచ్చును. ప్రతి పార్లమెంట్ ఒక రాజ్యాంగ పరిషదే ఈ విషయంలో! అయితే మనం ముందు చెప్పుకున్నట్టుగా, కేశవానంద భారతి కేసులో దేశ సర్వోన్నత న్యాయస్థానం చెప్పినట్టుగా రాజ్యాంగపు ప్రాధమిక నిర్మాణం దెబ్బతినకుండా రాజ్యాంగాన్ని సవరించుకోవచ్చును. అయితే ఈ ప్రాథమిక నిర్మాణం (బేసిక్ స్ట్రక్చర్) అంటే ఏమిటి అనేది చాలా చర్చనీయాంశం.

రాజ్యాంగంలోని ప్రధానమైన అంశాలు (1) ప్రవేశిక (ప్రియాంబుల్); (2) దేశం, దేశ సరిహద్దులు; (3) పౌరసత్వం; (4) ప్రాధమిక హక్కులు; (5) ఆదేశిక సూత్రాలు; (6) కేంద్రం, రాష్ట్రాలు, కేంద్రపాలిత ప్రాంతాలు, పంచాయతులు, మునిసిపాలిటీలు, సహకార సంఘాలు – వాటి అధికారాలు, పార్లమెంట్ రాష్ట్ర శాసన సభలు; (6) కేంద్ర–రాష్ట్ర సంబంధాలు; (7) కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ఆర్ధిక, ఆస్తి, ఒప్పందాలు, వ్యాజ్యాలు మరియు; (8) దేశ పరిధిలోపల వ్యాపార వాణిజ్యం లావాదేవీలు.

“ది ఇండియన్ కాన్‌స్టిట్యూషన్ ఈజ్ ఫస్ట్ అండ్ ఫార్మోస్ట్ సోషల్ డాక్యుమెంట్” అన్నారు గ్రాన్‌విల్ ఆస్టిన్. ఓ రకంగా చెప్పాలంటే ఇది “సామాజిక ఒప్పందం” (సోషల్ కాంట్రాక్ట్). సోక్రటీస్ మొదలుకొని రూసో దాకా ఈ సామాజిక ఒప్పంద సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూనే వున్నారు. మానవ సమూహం కలిసి ఉండడానికి తమ మధ్య తాము ప్రత్యక్షంగా, వ్రాత పూర్వకంగా కానీ, పరోక్షంగా, ఆనవాయితీగా కాని చేసుకునే ఒప్పందం లాంటిది. అయితే ఇందులో జెరిమీ బెంథామ్ లాంటి వారి “ఎక్కువమందికి ఎక్కువ ఆనందం’, ‘ప్రయోజన సిద్ధాంతం’ (యుటిలిటేరియన్ థీయరీ) అంశాలు కూడా వున్నాయి. అలాగే జాన్ రాల్స్ లాంటి ఆధునిక రాజకీయ సిద్ధాంతకారులు ప్రతిపాదించిన “తొలి స్థితి” (ఒరిజినల్ పొజిషన్), పరావర్తన సమస్థితి (రిఫ్లెక్సివ్ ఇక్విలిబ్రియమ్)ల వంటి కొన్ని అంశాలను కూడా చూడవచ్చును.

తొలుత రాజ్యాంగ పరిషద్ ఏర్పాటు చేసినప్పటి రాజకీయ సామాజిక పరిస్థితులు, సమీకరణాలు రోజురోజుకీ మారుతూ వచ్చాయి. తదనుగుణంగా సభ్యుల ఆలోచనలు, నిర్ణయాలు మారాయి. 26.11.1949 నుండి ఇప్పటి దాకా 103 సవరణలకి రాజ్యాంగం లోనయ్యింది. తమాషా ఏమిటంటే రాజ్యాంగం అమలులోకి వచ్చిన కొద్ది నెలల్లోనే 10 మే, 1951న తొలి సవరణ రావడం. అయితే 2 నవంబరు 1976న జరిగిన 42

సవరణ అత్యంత కీలకమయినది. చాలామంది దానిని ఓ చిన్న రాజ్యాంగం (మిని కానిస్టిట్యూషన్) అని అంటారు. అత్యవసర పరిస్థితి సమయంలో ఇందిరాగాంధీ హయాంలో జరిగిన ఈ రాజ్యాంగ సవరణ అనేక ప్రకంపనలని సృష్టించింది. "సోషలిస్ట్, సెక్యులర్" అనే పదాలు ప్రవేశిక (ప్రియాంబుల్)లోకి బలంగా వచ్చేశాయి. "మినర్వా మిల్స్" కేసులో సుప్రీంకోర్టు 31 సి అండ్ 368 అధికరణల విషయంలో మాత్రం ఈ సవరణలు (మినర్వా మిల్స్ లి. వి. యూనియన్ ఆఫ్ ఇండియా ఎయిర్ 1980 ఎస్‌సి 1789) అంతకు ముందు "కేశవానంద భారతి" తీర్పుకు వ్యతిరేకంగా భావించి, కొట్టివేసింది. ఎమర్జెన్సీ తరువాత జనతా ప్రభుత్వ హయాంలో వచ్చిన 44 సవరణ అనేక అంశాలలో పూర్వస్థితి తీసుకువచ్చింది. కానీ ఆస్తి హక్కు (ఆర్ట్ 31 సి) విషయంలో చాలా మౌలిక మార్పులు తెచ్చింది. అలాగే 13 ఏప్రిల్ 2014లో మోడీ ప్రభుత్వం తెచ్చిన జాతీయ న్యాయ నియామక కమిషన్ (నేషనల్ జుడిషియల్ అపాయింట్‌మెంట్ కమిషన్) బిల్లు (99వ రాజ్యాంగ సవరణ)ను సుప్రీంకోర్టు తన 16.10.2015 తీర్పులో కొట్టేసింది. కానీ తీర్పు తరువాత పరిణామాలు – సుప్రీంకోర్టు కాలేజియం, కేంద్ర ప్రభుత్వాల మధ్య కొన్ని తీవ్రమైన అంతర్గత ఉద్రిక్తతలకి సూచికగా వుంది. (సుప్రీమ్ కోర్ట్ అడ్వకేట్స్ – ఆన్ – రికార్డ్ అసోసియేషన్ & అనదర్ వి యూనియన్ ఆఫ్ ఇండియా 2016 / ఎఐఆర్ ఎస్సీ 1474)

ప్రొ. మొహ్మద్ గౌస్ అనే న్యాయ నిపుణులు (అనంతపూర్, ఆంధ్రప్రదేశ్) 1980లలో సుప్రీం కోర్టుల తీర్పులు, సామాజిక న్యాయం అనే అంశంపై విశ్లేషిస్తూ ఓ సుదీర్ఘ వ్యాసం వ్రాశారు (ప్రొ. మహ్మద్ గౌస్, ది టు ఫేసెట్స్ ఆఫ్ జుడిషియల్ ఏక్టివిజం ఇన్ "జుడిషియల్ ఏక్టివిజం అండ్ సోషల్ చేంజ్" ఇడి బై కె.కె. బాటియా, డీప్ & డీప్ పబ్లికేషన్స్, 1990). అందులో 1950–1975 ల మధ్య సుప్రీంకోర్టు, ఇతర ఉన్నత న్యాయస్థానాలు వ్యక్తుల, సంస్థల ప్రాథమిక హక్కులపై ఎలా ఎక్కువ దృష్టి కేంద్రీకరించాయో, 1975ల తరువాత ఆదేశిక సూత్రాలు – ప్రాథమిక హక్కుల మధ్య వైరుధ్యాలు ఎలా ప్రజా ప్రయోజన వ్యాజ్యాల ద్వారా కోర్టులని ప్రజా కోర్టులుగా మార్చాయో చాలా వివరణాత్మకంగా వివరించారు.

**3. భారత రాజ్యాంగం – కొన్ని ప్రశ్నలు :**

26.11.1949న రాజ్యాంగ పరిషద్‌లో ప్రజా ఆమోదం పొందిన నాటి నుండి (నిజం చెప్పాలంటే రాజ్యాంగ పరిషద్ ఏర్పాటుకు ముందు నుండి కూడా) రాజ్యాంగం చుట్టూ అనేక ప్రశ్నలు తిరుగుతూనే వున్నాయి. అనేక మంది మేధావులు, రాజనీతిజ్ఞులు,

న్యాయ కోవిదులు, రాజ్యాంగ నిపుణులు... ఇలా ఎంతోమంది,, ఎన్నో ప్రశ్నలు! అందులో కొన్ని ప్రధానమైన విషయాలని ఓసారి పరిశీలిద్దాం!

(1) భారత రాజ్యాంగంలోని కొత్తదనం, సృజనాత్మక అంటూ ఏమీ లేదు. అది అనేక దేశాల రాజ్యాంగాల మిశ్రమం.

భారత రాజ్యాంగంపై ఇది ప్రధాన విమర్శ. 1935 భారత చట్టం (గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్ట్ 1935) పై కొంత అలంకరణలే కానీ ఇందులో కొత్తదనం ఏముంది? నిజానికి ఇరవై శతాబ్దపు తొలి రోజులకే ప్రపంచ వ్యాప్తంగా చాలా దేశాలలో రాజ్యాంగాలు వచ్చేశాయి. అవన్నీ 1940వ దశకం నాటికి అనుసరణీయమైన అంశాలు కొద్దో, గొప్పో కలిగి వున్నాయి. 1935 చట్ట ప్రతిపాదిక అయినా, రాజ్యాంగ పరిషద్ సలహాదారుడైన బి.ఎన్. రావు – అమెరికా, కెనడా, ఐర్లాండ్, ఇంగ్లాండ్ దేశాలు వెళ్ళి అక్కడి న్యాయమూర్తులతో మేధావులతో, రాజ్యాంగ మేధావులతో చర్చించారు. ముఖ్యంగా జస్టిస్ ఫెలిక్స్ ఫ్రాంక్‌ఫర్టర్‌తో చర్చల్లో "డ్యూ ప్రాసెస్" అనే కాన్సెప్ట్‌ని రాజ్యాంగంలో పొందుపరచవలసిన అవసరం ప్రబలంగా వచ్చింది. నిజానికి రాజ్యాంగ ప్రతిపాదనలు చేసిన మిగతా గ్రూపులు – వామపక్ష, హిందూత్వ, సోషలిస్ట్ ఎమ్.ఎన్. రాయ్‌ల ప్రతిపాదనలని గమనిస్తే, దాదాపు అన్ని వర్గాలు పార్లమెంటరీ ప్రభుత్వ విధానంపై మొగ్గుచూపినట్టే కనిపిస్తుంది. కాబట్టి, భారత రాజ్యాంగంలో ఒరిజినాలిటీ లేదు అనేది అంత బలమైన విమర్శ కాదు. అయితే గాంధీ రాజ్యాంగం చర్చకు వచ్చి వుంటే ఎలా వుండేది అనేది కేవలం ప్రశ్నగా మిగిలిపోయింది.

(2) రెండవ ప్రధానమైన విమర్శ – ఆదేశిక సూత్రాలు న్యాయపరంగా ఒత్తిడి చేసి సాధించుకోలేనపుడు అవి రాజ్యాంగంలో వుండడం ఎందుకు అని. అలాగే ప్రాథమిక హక్కులు, ఆదేశిక సూత్రాల మధ్య వైరుధ్యం గురించి కూడా చర్చ ప్రారంభకాలం నుండి వుంది. అంటే 1950–1975ల మధ్య ఆదేశిక సూత్రాలు కేవలం ప్రభుత్వం వ్యవహారంలో వున్నా, 1980ల తరువాత ఆలోచనాపరులు, క్రియాశీలక వ్యక్తులు – ఆదేశిక సూత్రాల ఆధారంగా ప్రాథమిక హక్కుల్ని ప్రచారం చేయడం, ప్రజా ప్రయోజన వ్యాజ్యాల ద్వారా సుప్రీంకోర్టు దృష్టికి తీసుకురావడం వల్ల – బాంధువా ముక్తి మోర్చా కేసు, ఎ.ఎస్.ఐ.ఎ.డి. కేసు, ఓల్గా టెల్లిస్ కేసు తదితర కేసుల ద్వారా దేశం మొత్తం అనేక అసంఘటిత వర్గాల – ముఖ్యంగా బాండెడ్ లేబర్, ఇంటర్–స్టేట్ మైగ్రేంట్ లేబర్, చైల్డ్ లేబర్, ఉమెన్ లేబర్ – ఇలా అనేక సమస్యల పరిష్కారం వైపు పయనించాయి. అందువల్ల ఆదేశిక సూత్రాలు 1980ల తరువాత తమ కర్తవ్యాన్ని బాగానే నిర్వర్తించాయి.

(3) 42వ సవరణ ద్వారా "సోషలిస్ట్", "సెక్యులర్" అనే పదాలు అనవసరంగా రాజ్యాంగంలోకి ప్రవేశించాయనీ, అవి ఎన్నికైన ప్రభుత్వాల ఆర్థిక, సామాజిక ఆలోచనలపై అనేక ప్రతిబంధకాలు సృష్టించాయనే వాదన వుంది. నిజానికి రాజ్యాంగ పరిషద్ చర్చలలో ఈ రెండు పదాలు బాగానే చర్చకు వచ్చాయి. ఆనాటికి ప్రపంచ వ్యాప్తంగ "సమసమాజ సిద్ధాంతాలు", "మతాతీత రాజ్యం" అనేవి బలమైన రాజకీయ ఆలోచనలు. సమాజం తిరిగి ధనస్వామ్యాన్ని, మత రాజ్యాన్ని కోరుకుంటుందని ఎవరూ నమ్మలేదు. కానీ 1970ల నుండి ఈ రెండూ తిరిగి ఆధిపత్యం కోసం ప్రయత్నించాయి. నిజానికి 1954లో ఏకాభిప్రాయంతో, పార్లమెంట్, భవిష్యత్తులో భారత ప్రభుత్వం సమసమాజ పునాదులపైనే నడుస్తుందనే తీర్మానం చేసింది. అయితే 1970లలో ఫ్యూడల్, తిరోగమన వాదం తిరిగి బలపడుతున్న తరుణంలో వీటిని రాజ్యాంగంలో స్పష్టంగా చెప్పవలసిన అవసరం వచ్చింది. తత్కాలీన రాజకీయాల కోసం ఇందిరాగాంధీ ప్రభుత్వం వీటిని ప్రవేశపెట్టినా, ప్రస్తుత సమయంలో ఈ రెండు ప్రజల బలమైన ఆయుధాలు. అదే 42వ సవరణలో వచ్చిన "ఫండమెంటల్ డ్యూటీస్." ముఖ్యంగ అందులోని 51 ఎ(హెచ్) – "టు డెవలప్ ది సైంటిఫిక్ టెంపర్, హ్యూమనిజం అండ్ ది స్పిరిట్ ఆఫ్ ఇంక్వైరీ అండ్ రిఫార్మ్", భవిష్యత్తులో పురోగామి / తిరోగామి శక్తుల ఘర్షణలో ప్రధానమైన అంశం అయ్యే అవకాశం ఉంది.

(4) రాజ్యాంగంలో ప్రస్తుతం చాలా చర్చనీయమైన అంశం 370 అధికరణ. దీనివల్ల జమ్ము – కాశ్మీర్ ప్రాంతానికి ఆనాటి రెండు రాజ్యాల చర్చల ఫలితంగా కొన్ని ప్రత్యేక హక్కులు సంక్రమించాయి. నిజానికి రాజ్యాంగంలోని 21వ భాగం అధికరణలు 369 నుండి 392 దాకా – అనేక ప్రాంతాల ప్రత్యేక హక్కులకు సంబంధించినవే. 370వ అధికరణ రద్దు, కాశ్మీర్ ప్రత్యేక హక్కులని తొలగించడం కొత్త అంతర్జాతీయ చర్చకు దారి తీస్తుందా?

(5) పార్లమెంట్, ప్రధానమంత్రి, మంత్రివర్గం – ఇవన్ని బ్రిటిష్ సామ్రాజ్య చిహ్నాలు – మనకు ప్రెసిడెన్షియల్ రూపపు ప్రభుత్వం – (ప్రెసిడెన్షియల్ ఫాం ఆఫ్ గవర్నమెంట్) బాగుండేది అనే చర్చ కూడా రాజ్యాంగంపై విమర్శలో భాగమే. కానీ భారతదేశపు విస్తృతి, మత, కుల, భాషా, వైవిధ్యాలు, ప్రాంతాల తేడాలు – ఇలా చూస్తే ఒక వ్యక్తికి మొత్తం అధికారాలు కట్టిపెట్టే ప్రెసిడెన్షియల్ ఫాం ఈ దేశానికి ఉపయోగపడుతుందా? ఇది కూడా చాలా సుదీర్ఘంగా చర్చించవలసిన విషయం. కానీ రాజ్యాంగ పరిషద్ సమయానికి వామపక్ష రాజకీయాల ప్రతినిధులు మొదలుకొని, మతతత్వ, ప్రతినిధులతో

సహా మొత్తం మీద పార్లమెంటరీ విధానంపైనే ఎక్కువ మొగ్గు ఉన్నట్టుగా గ్రానవిల్ ఆస్టిన్ లాంటి రచయితలు గమనించారు.

(6) రాజ్యాంగం అంత చక్కని చర్చల తరువాత ఏకాభిప్రాయంపై వస్తే 1950 నుండి 2014 లోగా 103 సవరణలకు ఎందుకు లోనయ్యింది? అంటే రాజ్యాంగంలో ఏదో బలహీనతలు ఉన్నట్టే కదా – అనేది ఇంకో చర్చ. కానీ రాజ్యాంగ పరిషద్ ఏర్పాటు అవడానికి ముందు మనకు ఓ అర్థశతాబ్దపు సుదీర్ఘ స్వాతంత్ర్య పోరాటం, దాంట్లో వచ్చిన అనేక పరస్పర వ్యతిరేక ఆలోచనా ధోరణులు, 1946–1950ల మధ్య ప్రపంచ వ్యాప్తంగ ఉన్న రాజకీయ, తాత్విక సంఘర్షణలు వీలయినంత త్వరగా రాజ్యాంగ నిర్మాణం – ఏకాభిప్రాయంతో పూర్తవ్వాలనే ఆలోచన, ఇలా చాలా అంశాలు కొంత రాజ్యాంగాన్ని వ్రాయడంలో ఒత్తిడి పెంచినా 368 అధికరణం ద్వారా రెండు రకాల ప్రధానమైన సవరణలకి అవకాశం ఇచ్చారు. 103 సవరణలూ అత్యంత మౌళికమైనవి కావు. చాలాసార్లు చిన్న సవరణలు అవసరమైనాయి. కానీ 50 శాతం రాష్ట్రాలు ఆమోదముద్ర వేయవలసిన సవరణలు కొన్నే! నిజానికి ఇలా మార్పులు రావడం అనేది – "వర్కింగ్ డిమోక్రసీ"కి ప్రత్యేకంగా తీసుకోవాలే కాని, ఇందులో నెగిటివ్‌గా చూడవలసిన అంశం లేదు.

## ముగింపు

మొత్తం మీద నా ప్రయత్నమంతా 1946 నుండి 1950ల దాకా అనేక మంది రాజనీతుజ్ఞులు, న్యాయ నిపుణులు చేసిన మహత్తరమైన కృషి, దాని ఫలితంగా తయారైన ఈ రాజ్యాంగం – దేశంలోని అనేక బడుగు, బలహీన వర్గాల ఆశల ఫలితమని, దీని వెనకాల ఎందరో చేసిన అపూర్వమైన కృషి, అద్భుత చారిత్రక సమయంలో వారు చూపిన సంయమనం, వివేకత, శ్రమ – ఇలా ఎన్నో ఉన్నాయని నేటి యువతరానికి చెప్పడం. ప్రపంచ దేశాల – ఇటు సామ్యవాద దేశాలయిన రష్యా, చైనాలు కానీ, అటు ధనస్వామ్య దేశాలయిన అమెరికా, ఇంగ్లాండ్‌లు కానీ – వాటి రాజ్యాంగాలతో పోల్చుకుంటే మన భారత రాజ్యాంగం ఏమాత్రం తీసిపోదని, ఇంకా చెప్పాలంటే ఇది ఈ దేశ సమగ్రతకి చక్కని కరదీపిక, భరోసా అని యువతరానికి తెలియజేయడమే నా లక్ష్యం. ఇంత విస్తృతమైన చర్చలతో, విస్తృతమైన సభ్యులతో తయారుచేయబడిన రాజ్యాంగం మరొకటి లేదు. ఎప్పుడైన సందేహాలు కలిగినప్పుడు కేవలం ప్రచార మాధ్యమాలలో వచ్చే ఆధారరహిత ఆరోపణలకంటే కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ డిబేట్స్ అలాగే ఆనాటి అనేకమంది వ్రాసిన ప్రత్యేక సాహిత్యాన్ని పరిశీలించాలని నివేదన!

**రచనకు సంప్రదించిన పుస్తకాలు :**

(1) "రాజ్యాంగ పరిషద్ చర్చలు" (Constituent Assembly Debates) / భారత ప్రభుత్వ సమాచార శాఖ – 9 వాల్యూమ్‌లు

(2) "భారత రాజ్యాంగ నిర్మాణం" (Malcicy of India's Constitution) హెచ్.ఆర్. ఖన్నా, ఈస్టర్న్ బుక్ కంపెనీ, 2008 / 2009 ముద్రణ

(3) "భారత రాజ్యాంగం – దేశపు మూలస్థంభం" (The Indian Constitution - Cornerstone of a Nation) / గ్రాన్‌విల్ ఆస్టిన్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్, 1966.

(4) "ప్రజాతంత్ర రాజ్యాంగం – పని తీరు" (Working a Democratic Constitution) (గ్రాన్‌విల్ ఆస్టిన్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీ ప్రెస్, 1999)

(5) "సుప్రీం కోర్టు – భారత రాజ్యాంగం" (The Court and the Constitution of India), జస్టిస్ ఓ. చిన్నప్పరెడ్డి, OUP, 2008.

(6) "ఇండియాలో రాజ్యాంగ సమస్యలు" (Constitutional Questions in India) ఎ.జి. నురాని, OUP, 2008

(7) భారత రాజ్యాంగం 2 వాల్యూమ్స్, డి.డి. బసు (Shorter Constitution of India), Lexis Nexis Butterworths, Wadhwa, Nagpur 2009.

---

"దేశంలో సాంఘిక, ఆర్థిక న్యాయం వుండడానికి పరిశ్రమల, భూమి జాతీయాకరణ జరగాలి. దేశంలో ఆర్థిక వ్యవస్థ సోషలిస్టిక్ ఆర్థిక వ్యవస్థగా మారనంతవరకూ సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా న్యాయం చేయాలనుకునే ఏ భావిప్రభుత్వానికైనా ఇది ఎలా సాధ్యపడుతుందో నాకు అర్థం కావడం లేదు."

– డా॥ బి.ఆర్. అంబేద్కర్

# 3. సనాతన ధర్మం నుండి సామాజిక న్యాయం దిశగా, భారత రాజ్యాంగ నిర్మాణం

– **ఆచార్య కె.ఎస్. చలం,** ఆర్థిక శాస్త్రవేత్త,
విశాఖపట్నం, సెల్ : 7702200026

భారత దేశానికి స్వతంత్ర్యం ప్రకటించే ముందు రాజ్యాంగ పరిషత్ ను ఏర్పాటు చేసి లిఖిత రాజ్యాంగాన్ని ఆమోదింపజేసుకుని 26, జనవరి 1950 నుండి అమలు చేయటం జరిగింది. లిఖిత పూర్వకమైన రాజ్యాంగం రాకముందు ఏముండేది? అనే ప్రస్తావన వస్తుంది. అదే, బ్రిటిష్ వారు వచ్చాక చాల రకాల చట్టాలు రూపొందించారు. వాటిలో కొన్నింటిని కలిపి యీ దేశానికీ ఒక చట్టాన్ని 1935 లో ఏర్పాటు చేసి దాన్ని బ్రిటిష్ పార్లమెంటులో అంగీకరింపచేసి అమలు చేసారు. మరి, మళ్ళీ భారత రాజ్యంగం దేనికి అనే ప్రశ్న వస్తుంది. ఇక్కడే మన దేశానికీ మిగతా దేశాలకున్న వ్యత్యాసాన్ని గుర్తించాలి. డా. అంబేద్కర్ అన్నట్లు, భారత రాజ్యాంగం తయారు చేసే నాటికి లిఖిత పూర్వక రాజ్యాంగాలు  వచ్చి వందేళ్లు అయ్యాయి. 1935 చట్టం వుంది. మరి కొత్తగా చేసేదేముంటుంది అంటూ వచ్చిన విమర్శలకు యిచ్చిన సమాధానంగా '1950 తరువాత యీ దేశంలో రాబోతున్న వైరుధ్యభరితమైన సమాజాన్ని విలువలను' ఆయన పేర్కొన్నాడు. అందుచేత యిప్పుడు అమలులో వున్న భారత రాజ్యంగం గూర్చి మాట్లాడుకొనే ముందు, దీని ఔన్నత్యం చారిత్రక అవసరం గూర్చి తెలుసుకోవాలి.

ఈస్ట్ ఇండియా కంపెనీ పరిపాలన సాగించడం మొదలుపెట్టిన తరువాత న్యాయబద్ధ పాలనకోసం అనేకరకాలైన వ్యవస్థలను ఏర్పాటు చేశారు. నాటికి అమలులో వున్న మొఘల్ పాలకులు అవలంభించిన రెవిన్యూ, న్యాయ పద్ధతులను కొనసాగించడంలో చాలా యిబ్బందులు ఎదుర్కొన్నారు. నిజానికి నాటికి భారతదేశం ఒక దేశంగా, జాతిగా రూపొందలేదు. అనేక జాతుల (Race) కులాల, భాషల, నమ్మకాలతో వివిధ ప్రాంతాల్లో రాచరిక, జమిందారీ, పెత్తందారి పద్ధతుల్లో కొనసాగుతూవుండేది. ఇది బ్రిటిష్ వారికి అడ్డంకిగా మారింది. కలకత్తాలో ఏర్పాటు చేసిన సుప్రీంకోర్టుకు విలియమ్ జోన్స్ ను జడ్జిగా నియమించి భారత దేశంలోని వైరుధ్యాలను పరిశీలించమన్నారు. అప్పటికే బహుభాషాకోవిదుడైన జోన్స్ కలకత్తాలో కూర్చోని తన చుట్టూ వున్న కులీనుల భాష, రంగు, సంస్కృతి చూసి తమకు (తెల్ల) భారతీయులకు తేడా లేదని, భారతీయులే చైనా, ఈజిప్ట్ మిగతా ప్రాంతాలతో సంపర్కం కలిగి వున్నారని చెప్పాడు. ముఖ్యంగా భాషాపరంగా సంస్కృతం, గ్రీక్, లాటిన్, పెర్షియన్ వంటి భాషల మూలాలు ఒకటే అని ఇండో–

యురోపియన్ అన్న మాటను తయారు చేసి నేటి మనువాదులకు కావలసిన పునాదులను ఏర్పాటు చేశాడు. అయితే ఆయన ప్రవేశపెట్టిన విశ్లేషణ మూలంగానే దక్షిణాది భాషలకు సంస్కృతానికి ఏవిధమైన సంబంధం లేదని తరువాత పరిశోధకులు నిర్ధారించారు. జోన్స్ మనదేశ ధర్మ శాస్త్రాలను చదివి తీర్పులు చెప్పడం ప్రారంభించాడు. ముఖ్యంగా హిందువులు (బుద్దిస్ట్, జైన్, సిఖ్) అనుసరించే ధర్మ శాస్త్రాలు కూడా తూర్పున ప్రధాన భాగంగానూ మిగతా ప్రాంతాల్లో మితాక్షరిగాను, ముస్లింలు క్రైస్తవులకు వేరుగాను వున్న దేశంలో తీర్పులు చెప్పటం పెద్ద కష్టమయింది. ఆ సందర్బంలోనే నాటి బ్రాహ్మణ పండితుల సహకారంతో వారికి తోచిన విధంగా వారు చెప్పిన విధంగా సంగ్రహించి కొంత సమాచారం తయారు చేశారు. ఈ సమస్య ఎందుకంటే మిగత దేశాల్లో లాగ లౌకికమైన సూత్రాలు కాకుండా ఈ దేశం లో సర్వం ధర్మ శాస్త్రాలు, గుహ్య సూత్రాలు, మనుధర్మం, దండనీతి కౌటిల్యం వంటి వాటి ద్వారా ఒక సామాజిక వర్గాన్ని కాపాడుకుంటూ మిగతా వారిని పరిపాలిస్తూ వచ్చిన దేశంలో ముస్లిం పాలకులు కూడా పెద్దగా మార్పు చేయలేదు.అందుకే బ్రిటిష్ వారు ఈ దేశాన్ని చాలాకాలం పరిపాలిద్దామనుకొని ధర్మ శాస్త్రాలే కాకుండా లౌకికమైన న్యాయ సూత్రాలను రూపొందించడం మొదలు పెట్టారు. అప్పుడే 19 వ శతాబ్దంలో (1830) మెకాలేని న్యాయశాఖ మంత్రి (గవర్నర్ జనరల్ లా సభ్యుడు) గా నియమించడం జరిగింది. అంతకు మునుపు ఇంగ్లాండ్ లో ఆయన M.Pగా వుండేవారు. మెకాలే న్యాయ సూత్రాలను, చట్టాలను రూపొందించే క్రమంలో మన దేశ విద్యా విధానంపైన కూడా తన అభిప్రాయలు తెలియచేశాడు. ఆయన సలహా మేరకు ఇంగ్లీష్ విద్య ప్రవేశపెట్టడంతో దేశంలో వున్న అన్ని ప్రాంతాలతో సంప్రదించడానికి, ఉత్తర ప్రత్యుత్తరాలకు సులభమయింది. ఆ పని, గతంలో సంస్కృతం, పర్షియన్ బాషలు చేసినా అది కొందరికే పరిమితమవడంతో ఇంగ్లీషు అందరికీ అందుబాటులోకి రావటంతో (ఏ విధమైన కుల కట్టుబాట్లు లేకుండా) చట్టాలు చేయటానికి అవకాశం ఏర్పడింది.

ఈ ఉపోద్ఘాతం ఎందుకంటే ముఖ్యంగా మెకాలే రూపొందించిన చట్టాలే కొన్ని సవరణలతో నేటికీ అమలులో వున్నాయి. అంటే చట్టపరమైన పరిపాలన కోసం బ్రిటిష్ వారు చేసిన కృషి వారి అధీనంలోని ప్రాంతాలకే పరిమితమైంది. అప్పటి సుమారు 600 సంస్థానాల్లో చాలా పెద్దవి, రాజ్యాలుగా వుంటూ తమ చట్టాలను, చట్ట సభలను వారు ఏర్పాటు చేసుకున్నారు. ఇవన్ని స్వతంత్ర్యం వచ్చే నాటికి కలగూరగంపగా మారి వుంది. దీన్ని ఏ విధంగా సమిక్షించాలి, సమీకరించాలి? అలాగే యీ దేశంలో కొన్ని సామాజిక వర్గాలకు మినహాయిస్తే మిగతా వారికి, మహిళలకు సరైన ఆదరణ, పరిపాలనలోను చట్టాలలోను కొరవడింది. దాని కోసం అంటే మార్పు కొసమ్ చాలా

పోరాటాలు గతంలోనూ, బ్రిటిష్ కాలంలోనూ జరిగాయి. డా. అంబేద్కర్, రావు బహుదూర్ శ్రీనివాసన్‌తో సహా చాలా మంది బ్రిటిష్ ప్రభుత్వంతో చర్చలకోసం రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కు హాజరవటం, కోర్కెలను, ఆకాంక్షలను వెళ్ళగక్కటం జరిగింది. అందుచేత స్వాతంత్ర్యం వచ్చాక ఒక్కరోజులో అవన్ని పరిష్కరించటం జరగదు. అందుకు ప్రత్యేక ఏర్పాటు చేయాలి.

వైవిధ్య భరితమైన సింధూ (హిందూ) దేశంలో ఒకప్పుడు రాజులను ముఖ్యంగా జానపదాల నిర్వహణకు రాజన్యులను ప్రజాస్వామ్య బద్ధంగా ఎన్నుకునే పద్ధతివుండేది. బ్రాహ్మణ హిందుమతం దేశమంతా వ్యాప్తి చెందిన తరువాత మొత్తం అంతా తమ అధీనంలో ఉంచుకోవటానికి ధర్మ శాస్త్రాలు రూపొందించడం జరిగింది. వేదాల్లో వున్న ఒకటి రెండు వాక్యాలో, శ్లోకాలో తీసుకుని నాటి పరిస్థితులు, తమ అవసరాలకనుగుణంగా సూత్రాలు తయారుచేసి రాజులకు, మంత్రులకు, రాజపురోహితులకు విధాన నిర్ణయ వారిగా రాజ్యాన్ని కట్టడి చేసే ఏర్పాట్లు వుండేవి. వాటిని ధర్మ శాస్త్రాలు, నీతి శాస్త్రాలు, దండనీతి వంటి పేర్లుతో పిలిచినా అందులో చట్టంముందు అందరూ సమానమని నమ్మకం లేని సనాతన ధర్మంలో అది అసాధ్యం. అందుకే ఆధునిక యుగంలో మనుషులంతా సమానమని ఉపన్యాసాలు చెప్పడం కంటే నిజాయితీగా అది ఎలా సాధ్యమో రాజ్యంగబద్ధంగా చూపటానికి భారత రాజ్యంగ నిర్మాణం ఒక మచ్చుతునక.

భారత రాజ్యంగా రూపకల్పనకు అనేక కారణాలతో బాటు అప్పటి వరకు అతుకులు చిన్న చిన్న మరమ్మత్తులతో నడుస్తున్న రాజ్య నిర్మాణం పూర్తిగా నూతనంగా నిర్మించాలి. ఆ రాజ్యానికి గల ఉద్దేశాలు, లక్ష్యాలు ప్రజలకు సమాన అవకాశాల రూప కల్పన, ఆర్థిక సామాజిక అభివృద్ధి, ఆధునిక భావాల వ్యక్తీకరణకు పౌరులకు హక్కులు కల్పించాలి. ఇవన్ని జరగాలంటే ప్రజాస్వామ్య విలువలకు అవకాసం కల్పించే యంత్రాంగం చట్టబద్ధంగా వుండాలి. అప్పటికి ఒక్కో సంస్థానం ఒక రాజ్యంగా వుంటూ, ఒక్కో ప్రాంతం ఒక్కోవిధానం అవలంభిస్తూ తమలో మాత్రమే ఏకత్వాన్ని కలిగివున్నారు. భిన్నత్వానికి అవకాశం లేక వేరుగానే వున్నారు. అటువంటి చిన్న చిన్న సంస్థలన్నింటిని ఒకటి చేసి అందరు అంగీకరించే ఏర్పాటు జరగాలి. ముఖ్యంగా వందల సంవత్సరాలుగా కులం, భాష, ప్రాంతం, లింగం, రంగు తదితర అంశాల పేరున మనుషులను విభజించి పాలించే పరిస్తితులు పోవాలి. అందుకు రెండు సమూహాలుగా విడిపోయిన వారిని అంగీకరించే ఏర్పాట్లు జరగాలి. ఉదాహరణకు గాంధీ, అంబేద్కర్ మధ్య జరిగిన పూనా ఒడంబడిక సాధారణమైందేమీ కాదు. అగ్రకులాల హిందువుల తరుపున గాంధీ, దళితుల పక్షన

అంబేద్కర్ ఒక అంగీకారానికి వచ్చి సంతకాలు చేసిన 'సామాజిక కాంట్రాక్టు' అది. దానికి రాజకీయ పాలనాపరమైన వెసులుబాటు కల్పించాలి. దాన్ని చట్టం చట్రంలోకి తీసుక రావాలి గదా! అది 1935 నాటికీ జరగలేదు.

భారతదేశం భూగోళంలో వున్న అన్ని ప్రదేశాల కంటే నైసర్గికంగా ప్రాణికోటికి అనువైన ప్రదేశం. అందుచేత రకరకాల జంతువులే కాదు (ఆవుతో సహా) జాతులు కూడా ప్రతి తరంలోనూ యిక్కడకు వస్తూనే ఉన్నారు. తద్వారా భారతదేశ వైవిధ్యాన్ని, ఔన్నత్యాన్ని ఒక్క సింధు నది నాగరికతకు మాత్రమే పరిమితమైపోకుండా దేశం యవత్తూ వ్యాప్తి చేసిన ఒక గొప్ప దేశం. మిగత దేశాల్లో ఉదాహరణకు చైనా, యూరప్ లోని దేశాల్లోలా కొందరికి (జాతుల) పరిమితమైలేదు. ఈ వైవిధ్యభరితమైన దేశానికి సుసంపన్నంగా అందరికి అన్నీ అవకాశాలు కల్పించే విధంగా ఒక రూల్ బుక్ వుండాలి. చట్టాలు వున్నా అవి ఒక్కో చట్టం ఒక్క అంశానికి సంబంధించి వుంటాయి గాని ఆధునిక సమాజంలో వైరుధ్యాలు లేకుండా అందరూ కలిసి మెలసి జీవించేందుకు విశాలమైన ఒక ప్రాతిపదిక ఏర్పాటు కావాలి. ఆ పని మన దేశంలో రాజ్యాంగం చేసింది. చాలామంది విశ్లేషకులు యీ చట్టంలో కొత్తేమిలేదనుకోవచ్చు, నాటికి వున్న చట్టాలను (1935) తిరిగి రాసిందనే అనుకోవచ్చు. గాని, అది పాక్షికమైన అవగాహన. భారతదేశ సామాజిక, చారిత్రక తదితర వైరుధ్యాలను అవగాహన చేసుకోలేని సంకుచిత మనసుతో చేసిన వివరణ అది. అసలు రాజ్యాంగం అవసరమేముంది. లిఖిత రాజ్యంగమేలేని ఇంగ్లాండ్ బాగానే వుంది కదా!

భారత దేశాన్ని సర్వసత్తాక దేశంగా కొన్ని మౌళిక హక్కులు, అవకాశాల కల్పనే కాకుండా ప్రజాస్వామ్యయుతంగా సమానత్వం సాధించాలనే ఆశయంతో రాజ్యాంగం రూపొందించబడింది. అసలు భారతదేశానికి ఒక రాజ్యాంగం కావాలని ప్రతిపాదించినవాడు ఎమ్.ఎన్. రాయ్ కమ్యూనిస్ట్ 1934లో కాంగ్రెస్ పార్టీలో వుంటూ రాజ్యాంగ పరిషత్ ఏర్పాటు చేయాలని 1935 చట్టానికి ముందు ప్రతిపాదించాడు. రాజ్యాంగ ఉద్దేశాలను నెహ్రూ తదితరులు ప్రతిపాదించారు. ఇంకా విస్తృతంగా వుంటే బావుంటుందని అంబేద్కర్ వేరేగా ప్రతిపాదించారు. అంటే రాజ్యాంగం యొక్క అవతారిక రూపొందించడానికి కూడా చాలా చర్చ జరిగింది. ఇది ఎందుకంటె 'ఆర్థిక, సామాజిక, రాజకీయ, న్యాయ, భావ వ్యక్తీకరణ, నమ్మకాలూ, పూజించే స్వాతంత్ర్యం, అవకాశాలు, హోదా అందరికి సమానంగా, ప్రతి వ్యక్తి గౌరవాన్ని కాపాడే సహోదర భావాన్ని పెంపొందించడానికి యీ రాజ్యాంగాన్ని మనకు మనముగా రాజ్యాంగ పరిషత్ ద్వారా

1949లో, ప్రకటించుకోవటం జరిగింది. యిదే అవతారిక. 1976లో చిన్న రాజ్యాంగ సవరణ ద్వారా లౌకిక, సామ్యవాద మన్న మాటలు ప్రస్ఫుటంగా ఉండటానికి చేర్చినప్పటికీ రాజ్యాంగం యొక్క అసలైన ప్రాణం అదే నన్నది అవతారిక వివరణలోనే తెలుస్తోంది. నిజానికి 1935 చట్టానికి బి.యన్.రావు దాని ఆధారంగా తయారు చేసిన చిత్తు ప్రతినే చర్చించి రాజ్యాంగం రూపొందిస్తే రెండు సంవత్సరాల పదకొండు నెలల పదిహేడు రోజులు అంటే మూడు సంవత్సరాలు ఎందుకు పడుతుంది. మొత్తం 2437 అంశాలను 114 రోజులు చర్చించి 165 రోజుల పాటు పదకొండు దఫాలుగా కలిసారు. అంతటితోనే కాకుండా అనేక ఉప సంఘాలు వివిధ అంశాలపై ప్రత్యేకంగా చర్చించి రాజ్యాంగ పరిషత్ ముందుంచారు. అయితే క్రోడీకరించే బాధ్యతను డా॥ బి.ఆర్.అంబేద్కర్ మాత్రమే నిర్వహించ గలిగాడు. రాజ్యాంగ డ్రాఫ్టింగ్ కమిటిలో పండిట్ గోవింద్ వల్లభ పంత్, కె.యమ్.మున్షి, అల్లడి క్రిష్ణ స్వామి అయ్యర్, గోపాల స్వామి అయ్యంగార్, బి.యల్.మిట్టర్, మొహమ్మద్ సాదుల్లా, డి.పి.ఖైతాన్ సభ్యులు, అంబేద్కర్ అద్యక్షులు. ఇందులో ఎంత మంది పూర్తి కాలం వున్నారో, ఢిల్లీ వెలుపల ఎవరున్నారో చివరి రోజుల్లో ఆ విషయాలు చెబుతూ అందరు అంబేద్కర్ ను ప్రశంసించారు. బి.యెన్.రావు కూడా సివిల్ సర్వెంట్, ఆరోజుల్లో ఐ.సి.ఎస్.లో పదేళ్ళుంటే జడ్జిలుగా నియమించేవారు. ఆ విధంగా ఆయన అంతర్జాతీయ న్యాయ సంస్థకు వెళ్ళిపోయాడు. నాటికి ఆర్థిక అంశాల్లో నిష్ణాతుడు, న్యాయశాస్త్ర అధ్యాపకుడు ప్రభుత్వ న్యాయ కళాశాల ప్రిన్సిపాల్ గాపని చేసిన అంబేద్కర్ కు వున్న అనుభవం యీ రాజ్యాంగ రూపకల్పనలో ఎంతగానో ఉపయోగపడింది. అంతేకాదు భారత రాజ్యాంగ నిర్మాణంలో పాల్గొన్న 389 సభ్యుల్లో అన్ని ప్రాంతాల, సంస్థానాలకు ప్రాతినిధ్యం వహించిన వారే కాకుండా భాష, కులం, వర్గం, మతం వంటి అనేక అంశాలకు చెందినవారున్నారు. వారంతా చర్చించి నిర్మించిన బృహత్తర ప్రణాళిక భారత రాజ్యాంగం. ఇది అప్పటికి లేని ప్రజాస్వామ్య విలువలను, సమాన అవకాశాలు పుట్టుకతో కాకుండా మనిషిని మనిషిలాగానే గుర్తించి యివ్వాలనే ఆదేశించే ఆశయం గొప్పది. ప్రధానంగా ఆదేశిక సూత్రాల ద్వారా ప్రభుత్వం ఏమి చేయాలో సూచించే ఒకనైతిక విధిని ఎల్లప్పుడు సూచించే ప్రక్రియను దీని ద్వారా రూపొందించారు.

భారత రాజ్యాంగం అన్నది 395 అధికరణలు, సవరణలకు అవకాశాలు కల్పిస్తూ ఒక చలన శీలత కలిగిన ప్రజా అనుకూల చట్టంగా రూపొందకుండా వుండి వుంటే ఏమి జరిగేది? ఇప్పుడు వూహించటం చాలా భయం కలిగిస్తోంది. నాటి స్వాతంత్ర్య సమరయోధులు, సామాజిక కార్యకర్తలు, ఉద్యమాల నాయకులు, గాంధీ, నెహ్రూ, అల్లాడి, భోగరాజు పట్టాభి సీతారామయ్య వంటి దక్షిణాది మేధావి వర్గం కూర్చొని నిర్ణయించిన

అంగీకార పత్రం – భారత రాజ్యాంగం. ఈ హక్కులే లేకుండా వుంటే ధర్మశాస్త్రాలతో, వైయక్తిక ప్రలోభాలతో, అహంకార ధోరణలకు నిలయమై , విదేశీ తొత్తుల అమానుష పోకడలతో, పెత్తందారి మనస్తత్వం కలిగిన సనాతనవాదులు చేతుల్లో దేశం పడి 3000 సంవత్సరాలు వెనుకకు వెళ్ళే పరిస్థితులు వుండేవి. ఇటువంటి ప్రజాస్వామ్య యుతమైన అవకాశాలను ఉపయోగించుకోలేకపోవటంతో నేటికీ అంధయుగంలో వున్న కొన్ని ఆఫ్రికా దేశాలను చూశాము. ఆ పరిస్థితులు మనకూ వచ్చేవి. పొరుగు దేశాల్లోని కొన్ని గుంపుల్లా మనం నిత్యం కలహించుకుంటూ రక్తపాతం చిందించేవాళ్ళం. మన రాజ్యాంగం వుంది కాబట్టి దాన్ననుసరించి కనీస హక్కులు కలిగి మన గలుగుతున్నాం. మనుషులుగా జీవించే ప్రాథమిక హక్కులను రాజ్యాంగంలో సమత్వంతోబాటు, మాట్లాడే, తిరిగే స్వేచ్ఛ, పీడననిరోధక హక్కు, మత స్వేచ్ఛ, అంతరాత్మ స్వేచ్ఛ, విద్యా హక్కు, రాజ్యాంగ పరిహార హక్కు, అన్నింటికంటే విస్తృతమైన జీవించేహక్కు కలిగి ఉన్నాము. వీటిని నిర్వహించి రూపొందించిన చట్టాలు, వాటిని వ్యాఖ్యానించి తమ సొంత భాష్యాలతో నీరుగార్చిన ఒకానొక అనైతిక న్యాయవ్యవస్తలో కొందరు, బ్రిటిష్ కంటే పూర్వం వుండే పరిస్థితులకు తీసుకువెళ్ళటానికి ప్రయత్నిస్తున్నారని సుప్రీంకోర్టులో పని చేసి రిటైర్ అయిన జడ్జిలే తమ అక్కసు వెళ్లగక్కుతున్న పరిస్థితులున్నాయి.

అందుకే భారత రాజ్యాంగం 395 అధికరణలలోదాని ఆత్మ లేదు. అవి పరిపాలన, రాజ్య ధర్మాన్ని తెలియజేసె అంశాలను పొందుపరిచాయి. గాని మన రాజ్యాంగ ఆత్మ సనాతన ధర్మానికి దూరంగా ఆధునిక ప్రజాస్వామ్య, సామ్యవాద, లౌకిక రాజ్యంలో ప్రతిఒక్కరూ గౌరవంగా ఆత్మ తృప్తితో బ్రతికేందుకు కావలసిన విస్తృత మానవాధికారాన్ని ప్రతి భారతీయునికి అందించింది. అందుకే భారత రాజ్యాంగాన్ని ఇప్పుడున్న పరిస్థితుల్లో కాపాడుకోవలసిన కర్తవ్యం ప్రతి ఒక్కరిపై వుంది.

---

> "రాజ్యాంగం ఎంత మంచిదైనా, దానిని అమలుపరిచేవాళ్ళు చెడ్డవాళ్ళయితే అది కూడా చెడిపోవడం ఖాయం; రాజ్యాంగం ఎంత చెడ్డదయినా దానిని అమలుపరిచే వాళ్ళు మంచివాళ్ళయితే, అది మంచిదవడం కూడా అంతే ఖాయం."
>
> – డా॥ బి.ఆర్. అంబేద్కర్

# 4. భారత రాజ్యాంగం - ఆచరణానుభవాలు

– **గొర్రెపాటి మాధవరావు,** మానవ హక్కుల వేదిక,
నిజామాబాద్, ఫోన్ : 9059440011

**ఈ పద్యాలు చదువుదాం :**

కందం : **విను తొలి కృతయుగంబున మనుజుల యెడ దండనీతిమంతుడై రా
జనొకడు గలిగి యరయుట మనుజేశ్వర లేదు ధర్మ మతి మంద్రుతగన్**

కందం : **ఒండొరులకు రక్షకులై యుండుదురట్టుండ దైన్యమొదవిన లోభం
బొండొండ పెరిగి ధర్మము ఖండితమై మొదలుకొనిర కార్యంబులకున్**

కందం : **క్రమమున గామము రాగము దమ మ నముల ఒదవగా మదంబెక్కిన వి
భ్రమమొందుచు విచ్చలవిడి విమార్గచరితముల వేద విధ్వంసుకులై**

కందం : **మనుజుల ధర్మము బొడవడచిన వేదము గర్మములను జెడుటకు భయమం
దిన ఇంద్రాదులు గమలాసను గానగ మునులు దాముంజనిరి నరేంద్రా**

(మహాభారతంలోని శాంతిపర్వములో రాజ్యము – రాజ్యాంగాల పుట్టుక గురించి, రాజధర్మం గురించి భీష్ముడు ధర్మరాజుకి వివరిస్తున్న ఘట్టం నుంచి)

భీష్ముడు ఏమంటాడంటే.. మానవజాతి ఆవిర్భవించినప్పుడు రాజ్యం లేదు. ఆ తర్వాత కూడా చాలా కాలంపాటు లేదు. అప్పుడు ప్రజలు ఒకరికి మరొకరు పరస్పరం రక్షణగా ఉండేవారు. అలా ఉంటున్న క్రమంలోనే చెడ్డ పనులకు పాల్పడుతుంటే, అయ్యా భూలోకంలో ధర్మం నశించిపోతుందని దేవతలందరూ బ్రహ్మ దగ్గరికి వెళ్ళి మొరపెట్టుకున్నారు. అప్పుడు ఆయన గారు లక్ష అధ్యాయాలతో ఒక గ్రంథం రాసి దాని ప్రకారం నడుచుకుంటే అంతా బాగుపడుతుంది అని అన్నాడట. ఈ లక్ష అధ్యాయాలు చదివేసరికి జీవితం అయిపోతుందని భావించి వంకరుడు దాన్ని పదివేల అధ్యాయాలకు కుదించాడట. ఇది కూడా మనుషులకు కష్టమేనని ఇంద్రుడు దాన్ని ఐదువేల అధ్యాయాలకు కుదించాడట. దేవగురువైన బృహస్పతి మూడువేల అధ్యాయాలకు కుదించగా అసురుల గురువైన శుక్రుడు ఈ మొత్తం గ్రంథ సారాంశాన్ని 1000 అధ్యాయాలకు దించాడు.

రాజ్యాంగం రాసుకున్నాం గానీ మరి దాన్ని అమలుపరిచేవాడు ఎవడు అని సందేహం వచ్చిందట. విష్ణుమూర్తి దగ్గరికి వెళితే విష్ణుమూర్తి తైజసు డనే మానసపుత్రుణ్ణి పుట్టించాడు. అతను భూలోకానికి పోను అన్నాడట. అతడి కొడుకు కీర్తిమంతుడు కూడా 'నో' అన్నాడట. అతడి కొడుకు కీర్తిమంతుడు తపస్సు చేసుకుంటానని అన్నాడు. అతడి

కొడుకు కర్దముడు కూడా తండ్రి బాటే పట్టాడు. కర్దముడి కొడుకు అనంగుడు రాజ్యం చేసాడు గాని ఇంద్రియ భోగాలకు వశుడై పోయాడు. అతడి కొడుకు వేనుడు. అతను రాగద్వేషాలకు లోనయ్యాడట. రుషులకు కోపమొచ్చింది. దర్భలను మంత్రించి అతని మీదకు విసిరితే అవి బాణాలు గానూ, ఈటెలు గానూ మారి అతణ్ణి చంపేశాయి. అప్పుడు ఋషులు అతడి కుడి తొడను మదించితే బొగ్గు రంగులో ఒకతను పుట్టుకొచ్చాడు. రుషులు నిషీధ అన్నారు. అతడే నిషాదుడు. అతన్ని రాజ్యానికి అనర్హుని చేశారు ఋషులు. వేనుడి కుడిభుజాన్ని మధిస్తే సకల గుణాలతో, సమస్త ఆయుధాలతో మహా అందగాడు పుట్టాడు. విష్ణువు అంశ అతనిలోకి వచ్చింది. సమస్త ధర్మాలు అతనికి అధీనమైపోయాయి. అతడే పృథు చక్రవర్తి. రాజధర్మం ఏమిటి అని అంటే శుక్రుడిచే కుదించబడినటువంటి రాజ్య పాలన శాస్త్రం ప్రకారం పాలన సాగించడమే. ఆనాటి రాజధర్మం రాజ్యాన్ని విస్తరించడం, వర్ణాశ్రమ ధర్మాలని ప్రజలందరూ నిక్కచ్చిగా పాటించేలా చూడటం. ఇదే రాజు ప్రథమ విధి.

మౌర్య సామ్రాజ్యమే భారత దేశంలో ఏర్పడిన ప్రథమ రాజ్యం అని చరిత్రకారులు అంటారు. ఆనాటి రాజ్యపాలన 'కౌటిలీర్ధశాస్త్రమ్' ప్రకారం నడిచింది. వర్ణ ధర్మాలను సంకరం చెందకుండా చూడటమే రాజు బాధ్యత అని కౌటిల్యుని అర్థశాస్త్రం నొక్కి చెప్పింది.

ఈ వర్ణ ధర్మాల ప్రకారం, బ్రాహ్మణుడు వేదాధ్యయనం – పౌరోహిత్యం, క్షత్రియుడు రాజ్యపాలన, వైశ్యుడు వ్యవసాయం – వ్యాపారం చెయ్యాలి. శూద్రులు పై ముగ్గురికీ సేవ చేయాలి. ఇదే ధర్మం. ఈ ధర్మం సంకరం చెందకూడదు. ఎవరైనా సంకరం చేస్తే వాళ్ళకి శిక్షే. రాజ్యపాలన అంటే దండనీతే. ఆ రాజ ధర్మాన్ని పాటించే తపస్సు చేసుకునే శంభూకుని చంపాడు. ఆ రాజ ధర్మాన్ని పాటించే, క్షత్రియులు మాత్రమే నేర్చుకోవాల్సిన విలువిద్యను ఆటవికుడయిన ఏకలవ్యుడు నేర్చుకున్నందుకు అతడి బొటనవేలును నరికేశారు.

రాచరికాలన్నీ రెక్స్ ఈజ్ లెక్స్ అనే సూత్రంపైన ఆధారపడినవే. అంటే రాజే శాసనం. అందుకేనేమో "ఇది నా మాట. నా మాటే శాసనం" అంటుంది రాజమాత శివగామి దేవి!!!

1789 ఫ్రెంచి ప్రజాస్వామిక విప్లవంతో మొదలుకొని పలు ఐరోపా దేశాలలో రాచరికాలు అంతమయి ప్రజాస్వామిక ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. ఎన్నుకోబడిన ప్రజాప్రతినిధులచే చట్టసభలు ఏర్పడ్డాయి. చట్టసభలు చేసిన చట్టాలను అమలు చేయడం కోసం మంత్రివర్గాలు ఏర్పడ్డాయి. నేర చట్టాలను ఉల్లంఘిస్తే శిక్షలు వేయడానికీ, ఎదుటి వారి హక్కులను ఉల్లంఘిస్తే పరిష్కారాన్ని సూచించేందుకు కోర్టులు ఏర్పడ్డాయి. ఈ

మూడు విభాగాలలో ఒకరి విషయాలలో మరొకరు జోక్యం చేసుకోకుండా ఉండేలా ప్రజాస్వామిక రాజ్యాలు రాజ్యాంగాలను రూపొందించుకున్నాయి. ఈ మూడు విభాగాలకు విధులను రాజ్యాంగాలు కేటాయించాయి.

రాచరికాలలో పాలితులు మాట్లాడగలిగిన పశువులు మాత్రమే. రాజరిక పాలన తొలగించుకున్న తర్వాత కూడా ప్రజలు అలాగే ఉండిపోవాలా? కాదు అని అనుకున్నారు, స్వేచ్ఛను, సమానత్వాన్ని, సోదర భావాన్ని అందరూ అనుభవించే హక్కు ఉందని, ఈ హక్కును ప్రజలందరూ అనుభవించేలా ఆధునిక రాజ్యాంగాలు హామీ పట్టాయి.

రెండో ప్రపంచ యుద్ధం ముగిశాక బ్రిటన్లో అట్లీ నేతృత్వాన కొత్త ప్రభుత్వం ఏర్పడింది. ఎన్నికల్లో గెలిచి అధికారానికి వస్తే ఇండియా స్వతంత్ర దేశంగా ఏర్పడేలా చూస్తాం అని అట్లీ ప్రకటించి ఉన్నాడు. స్వతంత్ర దేశంగా ఏర్పడబోయే ఇండియాకి తన సొంత రాజ్యాంగం ఉండటం అవసరం. రాజ్యాంగాన్ని తయారు చేయటానికి రాజ్యాంగ పరిషత్తు కావాలి. 1946 మే 16వ తేదీన కేబినెట్ మిషన్ ప్రకటించిన ప్లాన్ ప్రకారం స్వతంత్ర భారతదేశం కోసం ఓ రాజ్యాంగ పరిషత్తు ఏర్పడింది.

భారతదేశంలోని బ్రిటిష్ వారి ఏలుబడిలో ఉన్న ప్రాంతాలలో పరిపాలనకోసం బ్రిటిష్ పార్లమెంటు 1935లో గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్ట్ పేరుతో ఓ చట్టాన్ని చేసి ఉంది. బ్రిటిష్ ఇండియాలో దాని ప్రకారమే పరిపాలన సాగింది. రాజ్యాంగ పరిషత్తు ఏర్పడే నాటికి భారత దేశంలో కొంతభాగం బ్రిటిష్ వారి ఏలుబడిలో ఉండగా కొంత భాగం సంస్థానాధీశుల అధీనంలో ఉంది. రాజ్యాంగ పరిషత్‌కి అప్పటికప్పుడు ఎన్నికలు జరపడం సాధ్యం కాదు కాబట్టి అప్పటికి ఎన్నికై ఉన్న అసెంబ్లీలలో నుంచి రాజ్యాంగ పరిషత్తు సభ్యులను ఎన్నుకోవాలని కేబినెట్ మిషన్ ప్లాన్. అలాగే సంస్థానాధీశులకు కూడా రాజ్యాంగ పరిషత్తులో స్థానం కల్పించాలి అనేది కూడా కేబినెట్ మిషన్ ప్లాన్‌లో భాగమే.

**విరుద్ధ భావాల సంఘర్షణ :**

రాజ్యాంగ పరిషత్ ఏర్పడింది. దేశంలో పరిపాలనకు సంబంధించి 1935 నాటి గవర్నమెంట్ ఆఫ్ ఇండియా యాక్ట్‌లోని అంశాలనే ప్రధానంగా స్వీకరించారు. భారత స్వాతంత్ర్యోద్యమంలో వివిధ పాయలు ఉండినాయి. బ్రిటిష్ పాలన నుంచి దేశాన్ని విముక్తం చేయాలనే అంశంలో అందరికీ ఒకే అభిప్రాయం ఉన్నప్పటికీ, స్వాతంత్ర్యానంతరం ఏర్పడబోయే దేశానికి సంబంధించి ఎవరి కలలు వారికున్నాయి. స్వాతంత్ర్యోద్యమంలో పనిచేసిన వారు బ్రిటిష్ పాలకుల చేతుల్లో తీవ్రమైన హింసను అనుభవించారు. బ్రిటిష్ పాలకులు ప్రజల హక్కులను హరించారు. మాట్లాడుకోవడానికి

సమావేశమైన జలియన్ వాలాబాగ్‌లో మారణకాండను సృష్టించారు. పత్రికాస్వేచ్ఛను హరించారు. రాజద్రోహం నేరం క్రింద గాంధీజీని జైల్లో బంధించారు. స్వాతంత్ర్యోద్యమ కాలంలో ఉద్యమకారులు అనుభవించినటువంటి హింస స్వతంత్ర భారతంలో జరగకూడదు అనుకున్నారు.

స్వతంత్ర భారతంలో స్వేచ్ఛా సౌరభాలు ఎల్లెడలా పరిఢవిల్లాలని అనుకున్నారు. కేవలం అధికారం మార్పిడి జరిగినంత మాత్రాననే దేశంలో సమానత్వం నెలకొంటుందని అనుకోలేదు మరొక పాయ. సంపద కొద్దిమంది ప్రైవేటు వ్యక్తుల చేతుల్లో కేంద్రీకృతం కాకూడదు అని ఆ పాయ అభిప్రాయం. రాజ్యం ఎంతగా హక్కుల హననానికి పాల్పడిందో అంతే మోతాదులో పౌర సమాజంలోని ఆధిపత్య శక్తులు వర్ణ ధర్మ భావజాల ప్రభావంతో సమాజంలో అట్టడుగున ఉన్న వారి హక్కులను హరించాయి. ఇప్పుడు మనం చెప్పుకుంటున్న షెడ్యూల్డ్ కులాలకు, షెడ్యూల్డు తెగలకు, ఇతర సామాజిక వెనుకబాటుకు గురైన కులాలకు చెందినవారిని విద్యకు దూరం చేశారు. ప్రభుత్వ ఉద్యోగాలకు దూరం చేశారు. ఈ వెనకబాటుతనం స్వతంత్ర భారతంలో దూరం కావాలి అనుకొంది ఒక పాయ. వర్ణధర్మం అసమానతని పాటించడం రాజ ధర్మం అంటుంది. అందుకే రాజ్యాంగంలోని ఆర్టికల్ 14 ప్రతికూల (నెగిటివ్) బాషతో మొదలవుతుంది. “రాజ్యం భారత భూభాగమందుగల ఏ వ్యక్తికీ శాసన దృష్టిలో సమానత్వం లేక శాసనం వలన కలిగే సమాన రక్షణను నిరాకరించరాదు”

ఇన్ని రకాల ఆశయాలతో, ఆకాంక్షలతో స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నవారికి, తమ కలలను సాకారం చేసుకునే రాజ్యాంగం కావాలి. పెట్టుబడిదారీ వర్గం వారి కోరికంతా పెట్టుబడిని పోగేయటమే. భారతరాజ్యం చేయాల్సిన పని అదేనని వారి అభిప్రాయం. ఆధునిక ప్రజాస్వామ్యం అంటే పెట్టుబడిదారీ వర్గం అధికారంలో ఉండగా జరిపే రాజ్యపాలన అని వారి అభిప్రాయం. ఇన్ని విరుద్ధ అభిప్రాయాలకీ నూతనంగా రూపొందబోయే రాజ్యాంగంలో చోటు కల్పించాలి.

అందుకే ప్రాథమిక హక్కులకు సంబంధించి ఒక అధ్యాయము, భారత రాజ్యము నిర్మించబోయే సమాజం కోసం రూపొందించే విధానాలను మార్గదర్శనం చేసేందుకు మార్గదర్శక సూత్రాలపై ఒక అధ్యాయము రూపొందించారు. ప్రాథమిక హక్కులకు సంబంధించిన అధ్యాయంలో పేర్కొన్న హక్కులను దేశ ప్రజలు అనుభవించాలి. అప్పుడే స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకు అర్థం ఉంటుంది. ఇక ప్రభుత్వం ఎప్పుడూ కూడా తన విధానాలను, మార్గదర్శక సూత్రాలలో పేర్కొన్న అంశాలను ప్రజల అనుభవంలోకి

తీసుకొచ్చేందుకు కృషి చేసేలా రూపొందించుకోవాలి. రాజ్యాంగ పరిషత్‌లో జరిగిన చర్చలు ప్రధానంగా ఈ రెండు అధ్యాయాల మీదనే కేంద్రీకృతమయ్యాయి.

అందుకేనేమో ఈ రెండు అధ్యాయాలే భారత రాజ్యాంగపు అంతరాత్మ అని గ్రాన్విల్ ఆస్టిన్ అంటాడు. (ది ఇండియన్ కాన్‌స్టిట్యూషన్, కార్నర్‌స్టోన్ ఆఫ్ ఎ నేషన్).

ప్రాథమిక హక్కులకు సంబంధించిన అంశాలపై రాజ్యాంగ పరిషత్‌లో చాలా తీవ్రమైన చర్చలే జరిగాయి. హక్కులనైతే రూపొందించారు గాని వాటి అమలుకు సంబంధించి నియంత్రణలను పెట్టారు. అందరికీ సమావేశం పెట్టుకునే హక్కు ఉంది అన్నారు. సంఘాలు ఏర్పరచుకునే హక్కు ఉంది అన్నారు. భావ ప్రకటనా స్వేచ్ఛ ఉందన్నారు. పత్రికా స్వేచ్ఛ అందులోనే అంతర్నిహితంగా ఉందన్నారు. ఎవరికి నచ్చిన మతాన్ని వాళ్ళు అనుసరించవచ్చు అన్నారు, ప్రచారం చేసుకోవచ్చు అన్నారు. భారతదేశం అంతా స్వేచ్ఛగా తిరిగే హక్కు ఉందన్నారు. భారతదేశంలోని ఏ ప్రాంతంలోనైనా స్థిర నివాసం ఏర్పర్చుకునే హక్కు ఉందన్నారు. నచ్చిన వృత్తినో, వ్యాపారాన్నో చేసుకునే హక్కు ఉందని అన్నారు. ఈ హక్కులన్నింటికీ 19వ అధికరణంలో చోటు కల్పించారు.

రాజ్యాంగం మొత్తానికి 21 వ ఆర్టికల్ మకుటాయమానమైనటువంటిది. "ఏ మనిషి జీవితాన్ని గాని, వ్యక్తిగత స్వేచ్ఛ ను గాని చట్టం నిర్దేశించిన పద్ధతిలో తప్ప మరో రకంగా తీసివేయడానికి వీల్లేదు" అని ఆర్టికల్ ప్రకటిస్తుంది. ఆర్టికల్ 19లో పేర్కొన్న హక్కులు భారత పౌరులు మాత్రమే అనుభవించగల హక్కులు. ఆర్టికల్ 21 లో పేర్కొన్న జీవించే హక్కు, వ్యక్తిగత స్వేచ్ఛను కలిగి ఉండే హక్కు ప్రతి మనిషీ అనుభవించగల హక్కులు.

**హ్యాట్స్ ఆఫ్ సోమనాథ్ లాహిరి :**

భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 19 (1)ని 19(2)తో కలిపి చదువుకుంటేనే భారత రాజ్యాంగం ప్రాథమిక హక్కులకు ఎంతటి హామీ ఇస్తుందో అర్థం అవుతుంది. రాజ్యాంగ పరిషత్‌లో ప్రాథమిక హక్కులకు సంబంధించిన చర్చ జరుగుతున్నప్పుడు సోమనాథ్ లాహిరి అనే సభ్యుడు ఈ ఆర్టికల్‌లోని భాషను చూసి ఈ ఆర్టికల్‌ని పోలీస్ కానిస్టేబుల్ వైఖరి నుంచి రూపొందించారని ఎద్దేవా చేశాడు. హక్కు ఇచ్చినట్టే కనిపిస్తుంటుంది. దాని కింద 'అయితే' అనే పదంతో ఆ హక్కును ప్రజల అనుభవములోనికి రానీయకుండా చేశారు అనేది ఆయన విమర్శ. (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ డిబేట్స్, బుక్-1, వాల్యూమ్ - 3, పేజీ 404, 6వ పునర్ముద్రణ, 2014, లోక్‌సభ సెక్రటేరియట్

ప్రచురణ) 'అయితే' పదానికి కొనసాగింపుగా పేర్కొన్న అనేక పరిమితులను దాటి మాత్రమే హక్కులు అనుభవించవచ్చు. ఉదాహరణకు ఒక మీటింగ్ పెట్టుకోవాలి అనుకుంటే ఆ మీటింగ్ శాంతిభద్రతలకు ప్రమాదకరంగా ఉంటుందని ప్రభుత్వం భావిస్తే ఆ హక్కులను అనుభవించడానికి వీల్లేదు. ప్రభుత్వానికి రిపోర్ట్ ఇచ్చేదెవరు? పోలీసులే. మీటింగు జరుపుకోబోతున్నాం అనగానే పోలీసులు క్రిమినల్ ప్రొసీజర్ కోడ్లోని 144వ సెక్షన్ని విధించమని ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్కు చెబుతారు. పోలీసుల మాటను ఎగ్జిక్యూటివ్ మేజిస్ట్రేట్గారు జవదాటరు.. మైకు పర్మిషన్ కావాలంటే పోలీసులు నిరాకరించవచ్చు. ఒక ఊరేగింపు తీస్తానంటే పోలీసులు పోలీస్ చట్టంలోని 31వ సెక్షన్ని విధించామని ప్రకటించేస్తారు. జవహర్లాల్ నెహ్రూ యూనివర్శిటీలో మీటింగులో మాట్లాడినారని విద్యార్థి నాయకులను రాజద్రోహం నేరంకింద జైలులో వేశారు. ఈ హక్కును వాడుకున్నందుకే పన్సారేనీ,  కల్బుర్గినీ, గౌరీ లంకేశ్నీ ఫాసిస్టు మూకలు తుపాకులతో కాల్చి చంపాయి. సమావేశం పెట్టుకునే హక్కుని, అక్కడ మన అభిప్రాయాలన్ని చెప్పుకునే భావప్రకటనా స్వేచ్ఛనూ, రాజ్యాంగం, పరిమితులకు లోబడిన హక్కుగా తయారుచేసింది కాబట్టే ఆ హక్కులు మృగ్యం అయిపోతున్నాయి.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చేస్తుందని కన్యాశుల్కం నాటకంలో ఓ పాత్ర సంబరపడిపోతూ ఉంటే, అయితే ఇక మన ఊర్లో కానిస్టేబుల్ ఉండడాండీ అని ఒక సామాన్యుడు అడుగుతాడు!!! సోమనాథ్ లాహిరి ఆనాడు రాజ్యాంగ పరిషత్లో చేసిన విమర్శలో ఎంత ముందుచూపు ఉందో మన జీవితానుభవం రోజురోజు రుజువు చేస్తోంది.

**హక్కుని నిరాకరించడానికి చట్టం ఉందా... అయితే ఒకే :**

ఏ.కె. గోపాలన్ అని కేరళలో ఓ కమ్యూనిస్టు పార్టీ నేత ఉండేవాడు. ఆయన్ని ప్రివెంటివ్ డిటెన్షన్ కింద అరెస్టు చేశారు. దేశమంతా స్వేచ్ఛగా తిరిగే హక్కు తనకి ఆర్టికల్ 19(1) ఇస్తుంది. కాబట్టి తన అరెస్టు అక్రమం అని ఆయన కోర్టులో కేసు వేశాడు. అంతేకాకుండా  ఆర్టికల్ 21 ప్రకారం తన వ్యక్తిగత స్వేచ్ఛను రాజ్యం ఉల్లంఘించిందని ఆయన అన్నాడు. సమాజంలో ఒక దృగ్గోచర అంశానికీ మరో దృగ్గోచర అంశానికీ సంబంధం ఉంటుందని ఏకె గోపాల్ గతితర్కంలో చదువుకున్నాడు పాపం. ఆర్టికల్ 19 కి ఆర్టికల్ 21కి సంబంధం లేదు పొమ్మంది సుప్రీంకోర్టు. ఆ తర్వాత నాలిక కర్చుకుంది లెండి. అది వేరే అంశం.

వ్యక్తి స్వేచ్ఛను హరించడానికి ఒక చట్టం ఉంటే చాలు, ఆ చట్టంలో ఒక పద్ధతి ఉంటే చాలు అని సుప్రీంకోర్టు ఏకె గోపాలన్ కేసులో భాష్యం చెప్పింది. ఇది జరిగింది 1950 మే నెలలో. రాజ్యాంగం అమల్లోకి వచ్చింది 1950 జనవరి 26న. ఆ చట్టం ఎట్లాంటి చట్టమైనా అయ్యుడవచ్చునా? చట్టపు సవ్యాపసవ్యతలను నిర్ణయించేందుకు రాజ్యాంగం తనకు అనుమతి ఇవ్వడం లేదు అని సుప్రీంకోర్టు చెప్పింది. ఎందుకంటే

ప్రభుత్వపు ఒక చర్య "డ్యూ ప్రాసెస్" అనే సిద్ధాంతానికి లోబడి ఉందా లేదా అని నిర్ణయించే అధికారం ఇచ్చే లా ఆర్టికల్ 21ని రాజ్యాంగ పరిషత్తు రూపొందించలేదు అని సుప్రీంకోర్టు చెప్పింది.

రాజ్యాంగ పరిషత్తులో ఈ "డ్యూ ప్రాసెస్" సిద్ధాంతం చర్చకు వచ్చింది. ముసాయిదా రాజ్యాంగంలో ఆ పదాలనే వాడారు. కానీ రాజ్యాంగ పరిషత్తుకు సలహాదారుగా ఉన్న బి.ఎన్. రావు ఈ పదాలను వాడడానికి తాను సుముఖంగా లేనని అన్నాడు. అంబేద్కర్ "డ్యూ ప్రాసెస్" అనే పదాలను వాడటానికి సుముఖంగా ఉన్నాడు. కానీ ఆయన తన అభిప్రాయాన్ని రాజ్యాంగ పరిషత్లో నెగ్గించుకునే లేకపోయాడు. బి.ఎన్. రావు అభిప్రాయమే ఎక్కువమంది సభ్యులను ఆకర్షించింది.

**చట్టం అంటే ఏదంటే అది కాదు. దానికి....**

ఇందిరాగాంధీ రెండో కోడలు మేనకా గాంధి. 1976లో ఆమె పాస్పోర్ట్ తీసుకుంది. 1977లో అధికారులు దాన్ని రద్దు చేశారు. మేనకా సుప్రీం కోర్టు మెట్లెక్కింది. తన వ్యక్తిగత స్వేచ్ఛకు హామీ ఇస్తున్న ఆర్టికల్ 21ని ప్రభుత్వం ఉల్లంఘించింది అని ఆమె వాదన. పాస్పోర్ట్ చట్టం ప్రకారమే పాస్పోర్ట్ను రద్దు చేశామని ప్రభుత్వ వాదన. ఏదైనా ఒక చట్టం ఉంటే, ఆ చట్టం ఒక పద్ధతిని నిర్దేశిస్తే, ఆ పద్ధతి ప్రకారం చేసిన చర్య ఆ వ్యక్తి స్వేచ్ఛను హరిస్తే, అప్పుడు ఆర్టికల్ 21 ప్రకారం లభించిన ప్రాథమిక స్వేచ్ఛను హరించి ఆర్టికల్ 21ని ఉల్లంఘించారని అనడానికి వీలులేదు అని ఏ.కె. గోపాలన్ కేసులో సుప్రీంకోర్టే చెప్పింది కాబట్టి మేనకా గాంధీ లేవనెత్తిన పాయింట్లో పసలేదని ప్రభుత్వ వాదన. కానీ సుప్రీంకోర్టు 1950లో తాను ఇచ్చిన తీర్పును 1978లో తిరగరాసింది. చట్టం నిర్దేశించిన పద్ధతి అంటే ఏదంటే అది కాదురా అబ్బాయ్, ఆ పద్ధతి న్యాయంగా, పక్షపాత రహితంగా, హేతుబద్ధంగా ఉండాలి అని చెప్పింది. అలా 'పద్ధతి' అనే పదానికి మూడు విశ్లేషణాలను తగిలించింది.

ఏ.కే. గోపాలన్ బడుగు వర్గాల ప్రతినిధి. మేనకా గాంధీ బలిసిన వర్గాల ప్రతినిధి. బయట సమాజంలో వర్గ పోరాటం ఎలా నడుస్తూ ఉంటుందో కోర్టుల్లో కూడా వర్గపోరాటం నడుస్తుంటుందని చెప్పడానికి జస్టిస్ చిన్నపరెడ్డి ఈ రెండు ఘటనలు కూడా ఉదాహరణలుగా చూపిస్తుండేవారు.

**జీవించే హక్కుకు మరణం లేదు :**

ఆర్టికల్ 21కి అసలు పరీక్ష 1975 జూన్ 25 నుంచి 1977 మార్చి 21 వరకు భారతదేశంలో అమల్లో ఉన్న ఎమర్జెన్సీ పెట్టింది. ప్రతిపక్ష నాయకులందరినీ జైల్లో పెట్టించింది ప్రభుత్వం. అసమ్మతి వ్యక్తపరచిన ప్రతి ఒక్కరినీ జైల్లోనన్నా పెట్టింది లేదా

ఎన్‌కౌంటర్ పేరుతో హత్యలు అయినా చేసింది. అరెస్టయి జైళ్ళలో ఉన్నవాళ్ళు వివిధ హైకోర్టులలో హెబియస్ కార్పస్ పిటిషన్‌లు వేశారు. జీవించే హక్కుకి, వ్యక్తిగత స్వేచ్ఛకీ అంతః సంబంధం ఉందని, వ్యక్తి స్వేచ్ఛ లేని జీవితం మానవ జీవితం కాదని వాళ్ళు వాదిస్తున్నారు. వివిధ హైకోర్టులలో ఉన్న కేసులన్నింటినీ సుప్రీంకోర్టు తన దగ్గరకే తెప్పించుకుంది. ఎమర్జెన్సీ అమలులో ఉన్న కాలంలో అన్ని స్వేచ్ఛలూ సస్పెండ్ అయిపోతాయి కాబట్టి ఆర్టికల్ 21 కూడా సస్పెండ్ అయినట్లేనని ప్రభుత్వ వాదన.

ఈ కేసులో వాదనలు వింటున్న ఐదుగురు జడ్జీలు అటార్నీ జనరల్ చెపుతున్న వాదనలను నిశ్శబ్దంగా వింటున్నారు. ప్రభుత్వ వాదనలో ఏదో లోపం ఉంది అనిపించింది ఒక్క జడ్జికి. ప్రభుత్వం తరపున వాదనలు వినిపిస్తున్న అటార్నీ జనరల్ “నిరేన్ డే’ని ఆ జడ్జి ఒక ప్రశ్న అడిగాడు. “ఏ పోలీస్ ఆఫీసర్ అయినా కక్షతో ఎవరినైనా చంపేస్తే, లేదా అరెస్టు చేస్తే బాధితుడికి ఆర్టికల్ 21 ఆసరాకి వస్తుందా రాదా” అని అడిగితే ఎమర్జెన్సీ ఉన్నంతకాలం ఆర్టికల్ 21 అలాంటి బాధితుడి రక్షనకు రాదు అని జవాబు చెప్పాడు అటార్నీ జనరల్. ఆర్టికల్ 21 ని రాజ్యాంగం ప్రసాదించింది కాబట్టే మనుషులకు జీవించే హక్కు వచ్చింది అని గవర్నమెంట్ వాదన, రాజ్యాంగం రాకముందు కూడా మనుషులు జీవించారు కదా మనుషుల జీవించే హక్కును గౌరవించి దాన్ని తనలో ఇముడ్చుకుందేమో ఒకసారి ఆలోచించండి అని ఆ జడ్జి అటార్నీ జనరల్‌కి చెప్పాడు. అటార్నీ జనరల్ ససేమిరా కాదన్నాడు. అప్పుడు, లోకం తలకిందులు అయినా మనుషులకు జీవించే హక్కు జీవించే ఉంటుందని ఆ జడ్జి తీర్పు చెప్పాడు. తక్కిన నలుగురూ గవర్నమెంట్‌తో ఏకీభవించారు. మైనారిటీ తీర్పు రాసిన ఆయన పేరు హెచ్.ఆర్. ఖన్నా. ఎమర్జెన్సీ ఎత్తివేసిన తర్వాత రాజ్యాంగానికి చేసిన 44వ సవరణలో హెచ్.ఆర్. ఖన్నా అభిప్రాయానికే చోటు దక్కింది. ఎమర్జెన్సీలో సైతం ఆర్టికల్ 21 సస్పెండ్‌కాదు అని ఈ రాజ్యాంగ సవరణ ప్రకటించింది.

ఆ తర్వాత సుప్రీంకోర్టు జీవించే హక్కును పలు విధాలుగా వ్యాఖ్యానించింది. జీవికను సంపాదించుకునే హక్కు కూడా జీవించే హక్కులో అంతర్భాగమేనంది. శుభ్రమైన పరిసరాలు పర్యావరణం కూడా జీవించే హక్కులో అంతర్భాగమేనంది.

కానీ ఎన్‌కౌంటర్ కేసులలో పోలీసుల మీద హత్యానేరం కింద కేసు నమోదు చేసి, వాళ్లను ప్రాసిక్యూట్ చేసి, తమను తామురక్షించుకునే ప్రక్రియలో భాగంగానే ఎదుటి వ్యక్తిని చంపాల్సి వచ్చిందని పోలీసులే రుజువు చేసుకోవాలి అని ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ఇచ్చిన తీర్పుపై సుప్రీంకోర్టు ఏ నిర్ణయాన్నీ ప్రకటించకుండా మిన్నకుండిపోవడం తన రాజ్యాంగ విధులను నిర్వర్తించినట్లు కాదు.

## ప్రైవేటీకరించాల్సింది మతాన్నా? పరిశ్రమనా?

సంపద కొద్దిమంది చేతుల్లో కేంద్రీకృతం కాకుండా ఉండేలా ప్రభుత్వ విధానాలను రూపొందించాలి అని మార్గదర్శక సూత్రాలు చెబుతుంటే అవి అమలు చేయడానికి పనికిరాని సూత్రాలు అని వాటిని ప్రభుత్వం యధేచ్ఛగా ఉల్లంఘిస్తోంది. ఈ ఉల్లంఘనలను హైకోర్టుల దృష్టికి, సుప్రీంకోర్టు దృష్టికి తీసుకువచ్చినా అవి చెత్త బుట్ట పాలే అవుతున్నాయి.

మతం ప్రైవేటు వ్యవహారం. పబ్లిక్ వ్యవహారాల్లో మతానికి ఎలాంటి పాత్ర ఉండకూడదు. అదే లౌకిక తత్త్వం. కానీ భారత రాజ్యం రాజ్యాంగానికి విరుద్ధంగా మతాన్ని ప్రైవేటీకరించాల్సింది పోయి పబ్లిక్ పరిశ్రమలను ప్రైవేటీకరిస్తూ మతాన్ని పబ్లిక్ అంశం చేస్తోంది.

రాజ్యాంగం కొన్ని ప్రాంతాల ప్రజలకి, కొన్ని ప్రాంతాలకు ప్రత్యేకమైన రక్షణలను కల్పించింది. ఆ రక్షణలను పూర్తిగా తొలగించడానికి పార్లమెంటులో తనకున్న బ్రూట్ మెజారిటీని వాడుకుంటున్నది.

స్వాతంత్ర్యోద్యమంలో కానీ, రాజ్యాంగ నిర్మాణంలో కానీ, ఆవగింజలో అరవయ్యోవంతు పాత్ర కూడా లేని వాళ్ళు దేశభక్తిని గురించి, రాజ్యాంగ స్ఫూర్తి గురించి ప్రవచనాలు చెబుతుంటే వినే గతి పట్టింది దేశవాసులకి. ఏ ప్రత్యేక పరిస్థితుల్లో ఆర్టికల్ 370 రూపొందిందో తెలిసి కూడా దాన్ని దుర్బలం చేయడానికి రాష్ట్రాన్ని రెండు ముక్కలుగా చీల్చారు. ఫెడరల్ స్ఫూర్తికి విఘాతం కల్గించారు. కశ్మీర్ ప్రజలకి బాహ్య ప్రపంచంతో సంబంధాన్ని తెంపి వేయడం ద్వారా వాళ్ల సంభాషించుకునే హక్కుని తొలగించి వాళ్ళని పశువుల స్థాయికి కుదించివేశారు. మనుషులు సంభాషించుకునే అవకాశాన్ని తొలగించడమంటే వారిని జంతు స్థాయికి కుదించడమేనని సుప్రీమ్ కోర్టే లోగడ చెప్పి ఉంది. అయినా సుప్రీమ్ కోర్టు జోక్యం చేసుకోవడానికి ముందుకు రావడం లేదు.

రాజ్యాంగాన్ని మార్చడానికి వచ్చామని సంఘ్ పరివార్ నాయకులు బాహాటంగానే చెబుతున్నారు. అది ఎలాంటి రాజ్యాంగం కానున్నదో? సందేహమా? హిట్లరుని ఆలింగనం చేసుకున్నవారు, భిన్నత్వాన్ని సహించలేరు వారు. వన్ నెస్ వన్ నెస్ అని గావుకేకలు పెడుతుంటారు. ప్రతి దృగ్గోచర అంశమూ విరుద్ధ అంశాల కలయిక అని వారికి ఎప్పటికీ అర్థం కాదు. అందుకే రాజ్యాంగాన్ని యూనిటరీ రాజ్యాంగంగా మార్చాలంటున్నారు. అందుకే నిరంతర జాగరూకతే స్వేచ్ఛకు మనం చెల్లించే మూల్యం. జాగ్రత్త ... జాగ్రత్త ... తస్మాత్ జాగ్రత్త.

---

# 5. రాజ్యాంగ పరిరక్షణ - కొన్ని ఆలోచనలు

మూలం : **మీరా సంఘమిత్ర,** ప్రజా ఉద్యమాల జాతీయ వేదిక (ఎన్.ఏ.పి.ఎం.)
అనువాదం : **గుత్తా రోహిత్,** విజయవాడ, సెల్ : 9958250777

దేశవ్యాప్తంగా 350 సంస్థల సమాఖ్య అయిన ప్రజా ఉద్యమాల జాతీయ వేదిక "రాజ్యంగ పరిరక్షణ యాత్ర" చేపట్టింది. ఈ యాత్ర 26 రాష్ట్రాల గుండా, ఉద్యమాలు/ సామాజిక మార్పు జరుగుతున్న 200 ప్రదేశాలు సందర్శిస్తూ, సమావేశాలు, ర్యాలీలు, నిరసనలు చేపడుతూ అక్టోబర్, 2 నుండి డిసెంబర్, 10 వరకు కొన్ని వేల మందితో సమావేశం అయ్యింది. ఉత్తరాన కశ్మీర్ నుండి దక్షిణాన కన్యాకుమారి వరకు, పశ్చిమాన దండి నుండి తూర్పున దిమాపూర్ వరకు ఈ యాత్ర ప్రయాణించింది. గాంధీ సహాయ నిరాకరణ చేపట్టిన దండి, బి.ఆర్, అంబేద్కర్ జన్మించిన మౌ, అంబేద్కర్ బుద్ధ మతం స్వీకరించిన నాగ్ పూర్, ఆయన అస్థికలని భద్రపరిచిన చైత్య భూమి, ఆదివాసి విప్లవకారుడు బిర్సా ముండా జన్మించిన ఉలిహటు, భగత్ సింగ్ ప్రాంతమైన జలంధర్ లోని ఖట్కర్ ప్రదేశాలని చుట్టడం జరిగింది.

అణిచివేతకి గురవుతున్న కోట్ల మంది ప్రజానీకం ఒక శతాబ్దానికి పైగా పోరాడితే మనకి సిద్ధించిన స్వాతంత్రం, ప్రజాస్వామ్యం, రాజ్యాంగం ఏ విధంగా ముక్కలు చెక్కలు అవుతున్నాయో ఈ యాత్ర కళ్ళకి కట్టినట్టు చూపించింది. ఆర్థిక వ్యవస్థ తిరోగమనం, సహజ వనరుల దోపిడీ, జీవనోపాధుల విధ్వంసం, ప్రభుత్వ సంక్షేమ పథకాలు అలాగే మౌలిక సదుపాయాలు అయిన విద్య, వైద్య, త్రాగు నీరు, రవాణా వ్యవస్థని ప్రైవేటు పరం చెయ్యడం, సామాజిక భద్రతని నిర్లక్ష్యం చెయ్యడం, భూమి, కార్మికులు, అడవి, పర్యావరణానికి సంబంధించిన చట్టాలని నిర్వీర్యం చెయ్యడం, యు.జి.సి, ఆర్,బి.ఐ,సి.బి.ఐ, బి.సి.ఐ, న్యాయవ్యవస్థ తదితర స్వయం ప్రతిపత్తి కల సంస్థల స్వయం-ప్రతిపత్తి మీద దాడి చెయ్యడం ఈ ఫాసిస్టు ప్రభుత్వం పాలనలో నిర్విరామంగా జరుగుతున్నాయి.

రాజ్యాంగంలోని లౌకికవాదం అనే విలువని పూర్తిగా ధ్వంసం చేసి, హిందూ రాష్ట్రం వైపుకి దేశాన్ని పరుగులు పెట్టిస్తున్న దానికి ఒక ప్రతీక రాజస్థాన్ లోని ఆల్వార్ ప్రాంతం లో పెహ్లూ ఖాన్, రక్బర్ ఖాన్ ల హత్య. మరో ప్రతీక ఆజంగఢ్ లో జరిగిన ఎదురుకాల్పుల్లో మరణించిన ముస్లిం యువత. రాజ్యాంగం, చట్టం పట్ల ఈ దేశ పరిపాలన వ్యవస్థకి, అధికార గణానికి ఏ మాత్రం గౌరవం ఉందో చెప్పే ఉదాహరణ రాజస్థాన్ లోని ప్రతాపఘఢ్ ప్రాంతానికి చెందిన జాఫర్ ఉదంతం. ఒక మహిళ బహిర్భూమికి

వెళుతున్న దానిని పురపాలక సంఘం వారు వీడియో తీస్తుంటే జాఫర్ అడ్డుతగిలాడు. దానితో ఆ పురపాలక సిబ్బంది జాఫర్‌ని కొట్టి చంపారు. ఈనాటి వరకు జాఫర్ విషయంలో న్యాయం జరిగింది లేదు.

మనదొక సమ్మిళిత దేశం అనటం ఎంత అబద్దమో హిమాచల్ ప్రదేశ్, ఆంధ్ర ప్రదేశ్, తమిళ నాడు, ఉత్తరాఖండ్ మొదలగు రాష్ట్రాలలో తెరిపి లేకుండా దళితుల మీద జరుగుతున్న దాడులు నిరూపిస్తున్నాయి. దేశ రాజధాని దిల్లీలోని ముస్లింలు తాము ఇష్టపూర్వకంగా ఈ దేశంలో భాగం అయ్యామని, ఈ దేశం అన్నా, ఈ దేశపు రాజ్యాంగం అన్నా తమకి ఎంతో గౌరవం అని అయితే తాము ద్వితీయ శ్రేణి పౌరులుగా బ్రతకాల్సి రావటం, ఎల్లప్పుడూ భయం, ఆందోళనల మధ్య గడపాల్సి రావటం భరింపరానిదిగా ఉందని చెప్పటం చూస్తే మన దేశం, మన రాజ్యాంగం, మన చట్టాలు ఏ మాత్రం ప్రభావవంతంగా అమలు అవుతున్నాయో మనకి స్పష్టంగా తెలుస్తుంది.

సంపద కొద్ది మంది చేతిలో పోగుబడి ఉండకూడదు, ఆర్థిక అసమానత్వం ఉ ండకుండా ఉండటానికి ప్రభుత్వాలు పని చెయ్యాలి అని మనం రాజ్యాంగంలో చదువుకున్నాము. దానిని మన పాలకులు, మనం కలిసి ఎంత అపహాస్యం చేశామో ఝార్ఖండ్ లోని సిమ్డేగా ప్రాంతానికి చెందిన చిన్నారి సంతోషి, తన తల్లి మనకి చెబుతారు. తిండి లేక, ఆకలితో చనిపోయింది సంతోషి. డెబ్బై ఏళ్ళ స్వాతంత్రం, రాజ్యాంగం ఇదే ఇచ్చింది.

రాజ్యాంగం లో మనం చదువుకున్నాము, ఈ దేశంలో ఉన్న వనరులకి, సంపదకి ప్రభుత్వం కేవలం సంరక్షకురాలు మాత్రమే. వాటిని ప్రజల బాగు కోసం, సంపదలో అంతరాలు లేకుండా ఉండటం కోసం ఉపయోగించాలి అని చదువుకున్నాము. అయితే సహజ వనరుల దోపిడీ ఎలా జరుగుతున్నదో చూస్తే ఈ రాజ్యంగ అధికరణలకి ఎటువంటి విలువా లేదు అనిపిస్తుంది. ఝార్ఖండ్‌లో, మహారాష్ట్రలోని గడ్చిరోలీలో తమ రాజ్యంలో తమ పాలన పేరు మీద రాజ్యాంగం ఆధారంగా జరుగుతున్న పథాల్ గడీ ఉద్యమం, ఒడిశాలోని నియామగిరిలో వేదాంత సంస్థ బాక్సైట్ తవ్వకాలకి వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటం, ఆంధ్రప్రదేశ్‌లో బాక్సైట్ తవ్వకానికి వ్యతిరేకంగా, సుమారుగా మూడు లక్షల మందిని నిర్వాసితులని చేసే పోలవరం ఆనకట్ట ఇవన్నీ ఉదాహరణలే. అటవీ హక్కుల చట్టంలో ఆదివాసీలకి, అడవి మీద ఆధారపడి జీవిస్తున్న వారికి జరిగిన “చారిత్రక అన్యాయాన్ని” సరిదిద్దటానికి చట్టం తీసుకువస్తున్నాం అన్నారు. అయితే అవన్నీ ఊకదంపుడు మాటలు అని అటవీ హక్కుల కోసం పోరాడుతున్న వారితో మాట్లాడితే

తెలుస్తుంది. అటవీ హక్కుల కోసం గొంతెత్తి, జరుగుతున్న దమనకాండ గురించి అఖిల భారత అటవీ కార్మికుల సంఘం వారితో మాట్లాడితే తెలుస్తుంది. అలాగే మధ్య ప్రదేశ్ లో నర్మదా లోయలో పునరావాసం కోసం పోరాడుతున్న వాళ్ళని, పశ్చిమ బెంగాల్ లో ఫరక్కా ఆనకట్టలకి వ్యతిరేకంగా పోరాడుతున్న వారిని, గుజరాత్ లోని మితి విర్దిలో, మధ్యప్రదేశ్‌లోని చుట్కాలో, తమిళనాడులోని కుడంకుళంలో అణు విద్యుత్తు కేంద్రానికి వ్యతిరేకంగా పోరాడుతున్న వాళ్ళని, సున్నితమైన కేరళలో జాతీయ రహదారి విస్తరణని వ్యతిరేకిస్తున్న వారిని, ఆంధ్రప్రదేశ్‌లోని తుందుర్రులో మెగా ఆక్వా ఫుడ్ పార్క్ కి వ్యతిరేకంగా పోరాడుతున్న వారిని, గోవాలో విమానాశ్రయం విస్తరణని వ్యతిరేకిస్తున్న వారిని కలిస్తే ఇటువంటి వినాశకర అభివృద్ధిని వ్యతిరేకిస్తున్న వారి మీద దమనకాండ ఏ స్థాయిలో ఉందో తెలుస్తుంది.

ఇక ఈ దేశంలోని హిందువుల పూర్తి మద్దతు తమకే లభించటం కోసం ఈ ప్రభుత్వం పార్లమెంట్ లో 'పౌరసత్వ సవరణ బిల్లు' ఆమోదింపచేసుకోవడానికి ప్రయత్నిస్తున్నది. అది ఈశాన్య భారతదేశంలో ప్రకంపనలు సృష్టిస్తున్నది. రాజ్యాంగంలో ఎక్కడా మతం ఆధారంగా పౌరసత్వం జారీ చెయ్యాలి అని లేదు. అలా చెయ్యటం రాజ్యంగం మౌలిక సూత్రాలకి విరుద్ధం కూడా. రాజ్యాంగం మౌలిక నిర్మాణాన్ని మార్చకూడదు అని సుప్రీం కోర్టు ఎప్పుడో తేల్చి చెప్పింది. అయినా కూడా ఈ ఫాసిస్టు ప్రభుత్వం ఆ విషయంలో ముందుకే పోతున్నది.

ఒక పక్కేమో ఉత్తరాంధ్ర, బోడో ల్యాండ్, ఉత్తర బెంగాల్ అభివృద్ధిలో ఆ రాష్ట్రంలోని మిగతా ప్రాంతాలతో పోల్చుకుంటే వెనుకబడి ఉండగా అమరావతి లాంటి స్మార్ట్ పట్టణాలని ప్రభుత్వం ప్రోత్సహిస్తున్నది. ఇది ఎంత వరకు సమంజసం? సమాఖ్య స్ఫూర్తి అనేది మన రాజ్యాంగంలో అంతర్భాగం. అది రాష్ట్రాల మధ్య, ఆలాగే ఒక రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల మధ్య కూడా వర్తిస్తుంది. ఇలాంటి అసమాన అభివృద్ధి అటువంటి సమాఖ్య స్పూర్తిని దెబ్బతీస్తుంది.

ఇదిలా ఉండగా మన రాజ్యాంగం ఎటువంటి పరిమితులు లేనిదా? కొన్ని చోట్ల మన రాజ్యాంగంలోని పరిమితులు ఎత్తి చూపడం జరిగింది. అందులో వాస్తవం ఉంది. మన రాజ్యాంగాన్ని మరింత సమ్మిళిత రాజ్యాంగంగా తీర్చిదిద్దటానికి చర్చ జరగాల్సిన అవసరం ఉన్నది.

---

# 6. మార్పుతీసుకొని రాగల రాజ్యాంగ శక్తి

## (Transformative constitutionalism) – వలసానంతర ప్రయోగం

మూలం : **ఇందిరాజయసింగ్,** లాయర్స్ కలెక్టివ్, ఢిల్లీ.
అనువాదం : **రమాసుందరి,** సెల్ : 7901254112

**('మార్పు తీసుకొని రాగల రాజ్యాంగ శక్తి' మీద** NLSI (National Law School of India) **లో ఇందిరా జైసింగ్ ఇచ్చిన ఉపన్యాసం పూర్తి పాఠం)**

'మన సమాజ మౌలిక నిర్మాణంగా మాత్రమే పరిమితమవుతూ, సాంప్రదాయక అర్థంగా మాత్రమే పరిమతమౌతున్న ఆధునిక భారత రాజ్యాంగం కీలకమైన నైతిక శక్తిగా మార్పు చెందాల్సిన అవసరం ఉంది' అని సుదీప్త కవిరాజ్ అనే రాజకీయ పరిశోధకుడు అన్నాడు. 'మన న్యాయ నిర్ణయాల్లో చట్టబద్ద నైతికత అనే వ్యక్తీకరణ అక్కడ నుండే వస్తుంది. రాజ్యం ఎలా ఈ కీలక ప్రాముఖ్యాన్ని సంపాదించిందో చెబుతూ ఆయన'న్యాయం, సమానత్వం, ఆత్మగౌరవం, సహాయం అనే డిమాండ్స్ లో రాజ్యానికి ఉన్న ప్రాముఖ్యత అంతర్గతంగా దాగి ఉంది. ఎందుకంటే ఈ డిమాండ్స్ అన్నీ రాజ్యం చేతనే నెరవేరుతాయి. ఈ అంచనాలను అందుకోవాల్సిన బాధ్యత రాజ్యానిదే' అన్నారు.

### రాజ్యం మరియు రాజ్యాంగం

రాజ్యానికి, రాజ్యాంగానికి మధ్య తేడాని గుర్తించాలి. రాజ్యాంగాన్ని నిర్మించింది రాజ్యమని అర్థం చేసుకోవాలి. మన రాజ్యాంగంలో 'ప్రభుత్వం' అనే పదమే లేదు. ఈ విషయం నన్ను ఎప్పుడూ విస్మయానికి గురి చేస్తుంది. రాజ్యాంగంలో షెడ్యూల్ 1 'రాజ్యం' అనే పదానికి నిర్వచనం యిచ్చింది. ఆర్టికల్ 1లో 'ఇండియా లేక భారత్ రాష్ట్రాల కలయికగా ఉంటుంది' అని నిర్వచించింది. ఈ నిర్వచనం భూభాగాలకి సంబంధించినదిగా గుర్తు పెట్టుకోవాలి. అది భూభాగాలను వర్ణిస్తుంది కానీ, రాజ్యాన్ని పైన చెప్పిన విధంగా ఎక్కడా పేర్కొనదు. ఆర్టికల్ 1 'భారతదేశం రాష్ట్రాల సంగమం (Federation) గా' వివరిస్తుంది. నా అభిప్రాయంలో సుప్రీంకోర్టు ఫెడరలిజం భారతదేశంలో ఎలా వర్తిస్తుందో చెప్పదు. అది ఒక్కోసారి అర్థ ఫెడరలిజం అంటుంది. ఒక్కోసారి బలమైన కేంద్రం ఉన్న ఫెడరల్ రాజ్యం అంటుంది. ఈ మధ్య సహకార ఫెడరలిజం అని కూడా మాట్లాడుకొంటున్నాం. ఏకైక పార్టీకి దారులు తీస్తున్న ఈ ప్రస్తుత సందర్భంలో పై వ్యక్తీకరణలు అన్నిటికి వదులు అర్థాలే ఉన్నాయి. సోషల్ మీడియాలో భారతదేశ మాప్ ను చూడండి. అది కాషాయ వర్ణంలో ఉంది.

సరే మనకు కొన్ని తికమక పెట్టే వ్యక్తీకరణలు ఉన్నాయి. 'రాజ్యం', 'ప్రభుత్వం', 'రాష్ట్రాల కలయిక (Union)' మొదలైనవి. వీటన్నిటిలో 'రాజ్యాంగం' ఒక్కటే ఎలాంటి తికమక లేని వ్యక్తీకరణ.

మనం అడగాల్సిన ప్రశ్న 'ఆధునిక రాజ్యం, ప్రకృతిలో ఆవరించి ఉన్నదానికంటే ఏమైనా భిన్నమైనదా?'

ఇలాంటి అన్ని ప్రశ్నలకు సమాధానం అమెరికా స్వాతంత్ర్య పోరాటఅనుభవంలో దాగి ఉంది. మిగతా దక్షిణ ప్రపంచ స్వాతంత్ర్య పోరాటాలకంటే ఇది ఎక్కువ సమాధానం చెప్పగలదు. దక్షిణ ప్రపంచ స్వాతంత్ర్య పోరాటాలు, ముఖ్యంగా భారతదేశంలో, కీలక ప్రాముఖ్యాన్ని బలవంతంగా సంపాదించుకొన్నాయి. దక్షిణ ప్రపంచంలో జరిగిన అలాంటి స్వాంతంత్ర్య పోరాటాలు వలస శక్తులపై పోరాడటమే కాదు, లోపల ఉన్న పీడక శత్రువులతో కూడా పోరాడాలి. ఆ శత్రువులు పేదరికం, సామాజిక ఆర్థిక అసమానత్వం, కుల వర్ణ లైంగిక  విభజన రూపాల్లో ఉన్నాయి. అది జరగలేదు.

అలా జరగనపుడు, ఏ రాజ్యమైతే ఈ అంతర్గత అసమానత్వాలను రూపు మాపుతుందో దాన్నే రాజ్యాంగ రూపకర్తలు పరిగణలోకి తీసుకొంటారు. దాన్ని సాధించటానికి రాజ్యాంగం ఒక పరికరంగా ఉంటుంది. దానితోనే ప్రజలు తమ అంతర్గత శత్రువులతో పోరాడాల్సి ఉంటుంది. భారతదేశ రాజ్యాంగ పోరాటం గురించి ఎంతో మంది మేధావులు ఇదే అభిప్రాయాన్ని రాశారు.

## 'మార్పు తీసుకొని రాగల రాజ్యాంగ శక్తి'కి మూలాలు

దీనికి మూలాలు వర్ణ వివక్ష ముగిసిన తరువాతి దక్షిణ ఆఫ్రికాలో ఉన్నాయి. దక్షిణ ఆఫ్రికా దేశపు మాజీ ప్రధాన జడ్జి మార్పు తీసుకొని రాగల రాజ్యాంగ శక్తి యొక్క సారం ఇప్పటి దక్షిణ ఆఫ్రికా రాజ్యాంగ పీఠికలో ఛాయాలుగా ఉన్నాయని కనిపెట్టారు. 'కలహాలతోటి, సంఘర్షణలతోటి,బయట పెట్టని బాధా అన్యాయాల తోటి నిండి లోతుగా విభజించబడిన గతానికీ– ప్రజాస్వామ్యం, శాంతియుత సహ జీవనం, వర్ణ జాతి వర్గ మత లైంగికతలకు అతీతంగా అందరు దక్షిణ ఆఫ్రికా వాసులకు అభివ ృద్ధి చెందే అవకాశాలను గుర్తించే భవిష్యత్తుకు మధ్య వారధిగా ఈ రాజ్యాంగం పని చేస్తుందని' ఆయన అన్నారు.

ఈ 'మార్పు తీసుకొని రాగల రాజ్యాంగ శక్తి', దాని అర్థం విషయంలో– ప్రపంచవ్యాప్తంగా వివిధ అనుభవాల నుండి జరిగిన అనేక చర్చలకు దారి తీసినా– దాన్ని నిర్వచించిన కీలక విషయం ఒక్కటే. అది విముక్తి, సమానత్వం, సహోదరభావం అనే రాజ్యాంగ ఆదర్శాల స్థిరమైన అభివృద్ధిలో రాజ్యం నిర్వహించే పాత్ర. ఈ సూత్రాల మీదే సమాజం నిలబడగలుగుతుంది. ఈ సూత్రాల మీద ఆధారపడిన సమాజ ఏర్పాటులో

రాజ్యం చురుకైన పాత్ర పోషించాలి. భారతదేశపు న్యాయ వ్యవస్థలో ఈ దృష్టి కోణానికి ముఖ్యమైన ప్రతిపాదకుడిగా కృష్ణ అయ్యర్ ఉన్నారు. ఆయన నా స్వంత పని మీద కూడా స్థిరమైన ప్రభావం చూపించారు. రాజ్యాంగాన్ని మార్పు చెందే గ్రంథంగా చూడాల్సిన అవసరం గురించి చెబుతూ ఆయన ఇలా అన్నారు. 'ఎవరి విముక్తి అయితే మన స్వాతంత్ర్యంలో అంతర్గత భాగమవ్వాలో– అట్టి మాల, మ్లేచ, వెట్టి చాకిరీదారుల, ఆకలిగొన్నవారల, కష్టించే అర్థ బానిసల కోసం మన సంస్కృతికున్న ప్రామాణికమైన గొంతు వినిపించాలి. మన దేశ ఉన్నత ఆధునిక నిర్మాతలు కూడా అదే చెప్పారు' అని.

డా. అంబేడ్కర్ ఇదే విషయాన్ని నొక్కి చెబుతూ 'మన రాజకీయ ప్రజాస్వామ్యాన్ని సామాజిక ప్రజాస్వామ్యంగా కూడా మార్చాల్సిన అవసరం ఉంది. సామాజిక ప్రజాస్వామ్యం యొక్క పునాది లేకుండా రాజకీయ ప్రజాస్వామ్యం మన లేదు. సామాజిక ప్రజాస్వామ్యం అంటే విముక్తిని, సమానత్వాన్ని, సహోదరత్వాన్ని గుర్తించే జీవన విధానం'అని అన్నారు.

సమాజాన్ని పునర్నిర్మించాలని కోరే విప్లవాత్మక గ్రంథంగా మన రాజ్యాంగాన్ని అర్థం చేసుకోవాలి. అయితే అందులో పాత ఆధిపత్యాలు మాయమవవని గుర్తుంచుకోవాలి. మార్పు చెందగల స్వభావం నిజంగా ఉండి, దాన్ని నిరంతరంగా నిర్వహించగలిగిన రాజ్యం మీదనే వాటిని రూపుమాపే భారం మోపబడి ఉంటుంది.

కాబట్టి 'మార్పు తీసుకొని రాగల రాజ్యాంగ శక్తి'లో రెండు కీలక విషయాలు ముందుకు వస్తాయి.

1. ఇప్పుడు ఉనికిలో ఉన్నవి కానీ, భవిష్యత్తులో అభివృద్ధి అవుతాయి అనుకొన్న అన్ని రకాల వివక్షలను గుర్తించి నిర్మూలించి దృఢమైన సమానత్వ ప్రాప్తిని ఇవ్వగలిగి ఉండాలి.
2. మంచి సామాజిక సంబంధాల ద్వారా సంపూర్ణ మానవ శక్తిని బయటకు తీసుకొని రావాలి.

'మార్పు తీసుకొని రాగల రాజ్యాంగ శక్తి'నీ, ఒట్టి రాజ్యాంగ శక్తినీ– వేరుగా చూడటం, అర్థం చేసుకోవటం చేయాలి. ఈ రెంటిలో ఏది 'మార్పు తీసుకొని రాగల రాజ్యాంగ శక్తి' కాదో తెలుసుకోమని మిచ్చేలా హైల్ బ్రోన్నర్ అనే ఆయన మనల్ని ఆహ్వానిస్తాడు. అమెరికా రాజ్యాంగ శక్తి, తన ఫెడరల్ స్టేట్ కు కేవలం న్యాయం, సమానత్వం ఇవ్వగలిగిన పనిని అప్పచెప్పటమే కాదు, విముక్తి కోసం ఎక్కువ దృష్టి పెడుతుంది.

కాబట్టి అమెరికా రాజ్యాంగ అనుభవం మిగతా భూభాగంలో ఉన్న 'మార్పు తీసుకొని రాగల రాజ్యాంగ శక్తి' కంటే భిన్నంగా ఉంటుంది. మిగతా భూభాగంలో

రాష్ట్రాలు క్రియాశీలక పాత్ర నిర్వహిస్తాయి. లోతుగా విభజించబడి ఉన్న అంతరాలు, విపరీతమైన వనరుల కొరత ఉన్న – భారతదేశం, దక్షిణాఫ్రికాలాంటి దేశాలలో రాజ్యాంగం పరాజయం పాలు అవుతుంది. పై రెండు విషయాలు (బాగా విభజించబడి ఉన్న అంతరాలు, విపరీతమైన వనరుల కొరత) మనల్ని మొదట ఒక దేశంగా అభివృద్ధి చెందనీయవని అంబేడ్కర్ అంటారు. ఎందుకంటే కులం మీద ఆధారపడిన వివక్షలు ఎలాంటి సహోదరత్వాన్ని ఉనికిలో లేకుండా చేస్తాయి. అలాగే ఒక దేశాన్ని కూడా అవి ఏర్పాటు చేయనీయవు.

భారతదేశ రాజ్యాంగ పోరాటం పాత ఆచరణల నుండి, అంతరాల నుండి వైదొలిగింది అన్నారు. మన రాజ్యాంగం ఏర్పడి 70 సంవత్సరాలు అయిన తరువాత ఇటీవల కాలంలో రాజస్తాన్ హైకోర్టు, లాయర్లు జడ్జిని ఉద్దేశించి 'మీ లార్డ్' అని అనవసరం లేదని నిర్ణయం తీసుకొన్నది. ఈ పిలుపు తప్పనిసరి అని మన రాజ్యాంగంలో ఆర్టికల్ 14(iv)లో రాసి ఉంది. ఆ కోర్టు ప్రధాన న్యాయమూర్తి రవీంద్ర భట్ మనకు వలసవాదం నుండి ప్రజా ప్రభుత్వం వరకు జరిగే మార్పుకు ఉదాహరణగా నిలిచారు. అది కేవలం భాష అయినప్పటికీ, మార్పుకి భాషే అత్యంత శక్తివంతమైన పరికరం. నేను భారతదేశ ప్రధానమూర్తికి రాసిన బహిరంగ ఉత్తరంలో చెప్పినట్లుగా 'భాష కేవలం సంభాషణపరికరం మాత్రమే కాదు. అంతకంటే ఎక్కువ. అది ప్రస్ఫుటంగా చెప్పగల సామాజిక, సాంస్కృతిక, రాజకీయ సూచిక. అది ఇప్పుడు ఎలాంటి సమాజంలోనైనా మనుగడలో ఉన్న ధోరణులను ప్రతిబింబిస్తుంది.'

అటార్నీ జనరల్ నన్ను ఎవరి భార్యగానో చెప్పినపుడు ఈ సంగతి జరిగింది. తరువాత అతను, తన వైపు నుండి తప్పు లేకుండా, ఆ పదాన్ని కరెక్ట్ చేసుకొన్నాడు. జస్టిస్ కృష్ణ అయ్యర్ చెప్పినట్లు 'మనం మన జడ్జిలకు నేర్పుకోవాలి.' నేను దానికి అదనంగా ఏమి చేరుస్తున్నానంటే 'కోర్టులో మన సహోద్యోగులకు కూడా నేర్పుకోవాలి.' ఇలాంటి చిన్న చిన్న పద్ధతుల్లోనే, రోజు రోజుకీ, మనం మనకు జరిగే చిన్న చిన్న అన్యాయాలను సహించనప్పుడే మార్పు వస్తుంది.

న్యాయవృత్తి వలసవాదం నుండి బయట పడటం ఇంకా జరగలేదు. 2017 ఆగస్ట్ 15, స్వాతంత్ర్య దినోత్సవం రోజు సీనియర్ గౌన్ (లాయర్లు వేసుకొనే పెద్ద కోటు) వదిలించుకోవటానికి సీనియర్ కౌన్సిల్‌ని ప్రశ్నించడం నేను మెల్లిగా మొదలు పెట్టిన మార్పు ప్రయత్నం. ఆ రోజు నుండి నేను ఎప్పుడూ పెద్ద కోటు వేసుకోలేదు. NLSU విద్యార్థులుగా మీలో మార్పు తెచ్చిన క్షణం ఏమిటంటే, నా మీదా ఆనంద్ గ్రోవర్ మీదా FIR నమోదు చేశారనే పూర్తి అవగాహనతో మమ్మల్ని ఈ సభకు మీరు పిలవడం.

క్రిమినల్ ప్రొసీజర్ లో ఎక్కడా లేని పదం రైడింగ్– అది మా ఇళ్ల పరిసరాలపై జరిగిందని తెలిసి కూడా మీరు నన్ను ఆహ్వానించారు.

ఆ రైడింగ్ జరిగిన రోజు ఆనంద్ గ్రోవర్ సుప్రీం కోర్టులోని 4వకోర్టులో వాదిస్తున్నాడని మీకు చెప్పకుండా ఉండలేకపోతున్నాను. ఆయన సిబిఐ అధికారులతో 'నేను ఎప్పుడూ నా క్లైంట్స్ ను వాయిదాలకు వదిలేయలేదు. ఇప్పుడు కూడా వదిలేయలేను' అని చెప్పాడు. మానవ హక్కుల పరిరక్షకులుగా ఉన్న మమ్మల్ని టార్గెట్ చేశారని తెలిసీ కూడా మేము అక్కడ ఉండటం అంటే– అది మమ్మల్ని నిర్వచించే, పరీక్ష చేసిన సమయం.

## దృఢమైన స్వేచ్ఛ వైపు ప్రయాణం

విముక్తి, సమానత్వం, స్వేచ్ఛ, ఇంకా పొందు పరచబడిన ఇతర ఆదర్శాలకు హామీ ఇస్తూ రాజ్యం క్రియాశీలక పాత్ర తీసుకొన్నదనుకొంటే ఈ ఆదర్శాలలో ఉన్న విషయం ఏమిటన్నది తరువాత వచ్చే సహజమైన ప్రశ్న. ఈ ఆలోచనలకు, ప్రజలు ఈ ఆదర్శాలను చేరుకోవటానికి రాజ్యం పెట్టే పరిమితులు ఏమిటన్న ప్రశ్న కూడా వస్తుంది. 'మార్పును తీసుకొని రాగల రాజ్యాంగ శక్తి'అనే విషయాన్ని అర్థం చేసుకోవటం ఏమి డిమాండ్ చేస్తుందంటే రాజ్యం ఈ లక్ష్యాలను క్రియాశీలకంగా ముందుకు తీసుకొని వెళ్లటం, ఈ ఆదర్శాలను అనుభవించటానికి ఉన్న అన్ని అవరోధాలను అధిగమించటం.

అమర్త్యసేన్ తన పుస్తకం 'Development as Freedom' లో వ్యక్తి వృద్ధికి, అభివృద్ధికీ అడ్డుపడుతున్నదౌర్జన్యకరమైన స్వేచ్ఛ లేనితనాల గురించి మాట్లాడుతూ నిర్ణయాత్మక సమానత్వపు అర్థాన్ని ఉల్లేఖిస్తాడు. మనం చెప్పుకొంటున్న స్వేచ్ఛలేనితనాలలో వ్యవస్థాపరమైన సామాజిక అణచివేత, ప్రజా సౌకర్యాల విస్మరణ,అసహనం, అణచివేసే రాజ్యాల అతి క్రియాశీలకత్వం కూడా వస్తాయి. నిర్ణయాత్మక స్వేచ్ఛలను తిరస్కరించటం అంటే అర్థం ఆయన చెబుతాడు. ఒక్కోసారి సరైన బట్టలకోసం, వైద్యం చేయించుకోగల జబ్బులకు పరిష్కారం కోసం – 'స్వేచ్ఛ గలిగిన ప్రజలను' కొల్లగొట్టే ఆర్థిక పేదరికానికి సంబంధం ఉంటుందని ఆయన వాదిస్తాడు.

## మార్పు తీసుకొని రాగల రాజ్యాంగ వ్యవస్థ -- న్యాయ వ్యవస్థ

చట్టపరమైన ఆదర్శాలైన సమానత్వం, విముక్తి, సహోదరత్వంల మీద న్యాయ మీమాంస ఎమర్జెన్సీ తరువాత ప్రారంభం అయ్యింది. ఎమెర్జెన్సీ తరువాత కాంగ్రెస్ ప్రభుత్వపు ఓటమి నుండి కోలుకొంటూ సుప్రీం కోర్టు, దాని చట్టబద్ధతను వెతుక్కొనే పనిలో ప్రజా ప్రయోజన వాజ్యం గురించి మాట్లాడింది. ఇక్కడ ఉన్న కామన్ వెల్త్ వ్యవస్థ మన భారత పరిస్థితులకు సరి కాదని జస్టిస్ భగవతి తీర్మానించాడు. గాయాన్ని స్వయంగా గుర్తించడం, దానికి అదే మందును వెతుక్కోవటం అనే విషయాల మీద ఆ

వ్యవస్థ ఆధారపడి ఉంటుంది. ఇక్కడి ప్రజలకున్న అతి నిరక్షరాస్యత వలన, ఈ విధానం వారు న్యాయాన్ని పొందటానికి గ్యారెంటీ ఇవ్వదు.

ప్రజా ప్రయోజన వాజ్యం రూపకర్తల్లో ఒకరైన జస్టీస్ భగవతి ఏడి ఎం జబల్పూర్ జడ్జిమెంట్ రచయితల్లో ఒకరు కావడం యాదృచ్ఛికం కాదు. (ఎమెర్జెన్సీ కాలంలో ఎవరూ వారి హక్కుల కోసం కోర్ట్ ను ఆశ్రయించకూడదనే ఈ జడ్జిమెంట్ ఆ రోజుల్లో చాలా వివాదాస్పదమైయ్యింది– అనువాదకురాలు) 'ప్రజా ప్రయోజన వాజ్యం' (PIL)కి ఉన్న ఈ పరిమితి దాని పునాదిలోనే ఉంది. ఇది ఇటీవల కాలంలో PIL మిగతా వాటికన్నింటి కంటే అణిచివేతకు ఒక పరికరంగా పనికి వస్తుందని పచ్చిగా రుజువు అయ్యింది. ఎందుకంటే PIL జడ్జిల ఇష్టం (discretion) మీద ఎక్కువగా ఆధారపడి ఉంటుంది.

జడ్జిలకు తోచినట్లు చేయవచ్చుననే (discretion) సూత్రం, న్యాయ సూత్రానికి వ్యతిరేకమైనది. తోచినట్లు కాకుండా ఏ చట్టం అమలు కాదు, ఏ అధికారి పని చేయలేడు అనే విషయం నాకు తెలుసు. కానీ న్యాయచట్టం అనే ముసుగులో నిర్ణయాలను ఫేవరిజానికి దిగజార్చగల అవకాశం, అసంతృప్తి వాదులను టార్గెట్ చేయగల అవకాశం భారతదేశంలో ఉన్నాయి. దీన్ని వెంటనే పరిష్కరించాలి. ఇష్ట ప్రకారం వ్యవహరించ వచ్చుననే పేరుతో అధికారాన్ని కొన్ని ప్రత్యేక ఉద్దేశ్యాలకు వాడకూడదు. భారతదేశానికి బాధ్యత అనే సిద్ధాంతం కొరవడింది. నిజంగా చెప్పాలంటే తోచినట్లు చేయవచ్చుననే (discretion) విషయానికి, నిర్ణయకర్తలు ఏమైనా చేయవచ్చుననే ఉద్దేశ్యమే ఉంటుంది.

**పౌర, రాజకీయ హక్కులు లేకుండా ఆర్థిక, సాంఘిక హక్కులు ఉండవు**

మేము లాయర్ల కలెక్టివ్ గా కూడా వోల్గా తెల్లిస్ కేసు, బాంబే వీధి వర్తకుల యూనియన్ కేసు వాదించేటపుడు ఆర్థిక హక్కుల మీదే పని చేయాల్సి ఉంటుందని అనుకొన్నాము. ఆ హక్కులు వస్తే మంత్ర దండంలాగా పేదరిక నిర్మూలన జరుగుతుందని అనుకొన్నాము. మా తరం వాళ్లు మాకు పౌర, రాజకీయ స్వేచ్ఛలను ఉన్నాయని భావించేసుకొన్నామని నాకు అర్థం అయ్యింది. మేమంతా స్వాతంత్ర్యం తరువాత పుట్టిన వాళ్లం. మాకు పౌర, రాజకీయ స్వేచ్ఛలు అనువంశికంగా ప్రసాదించబడ్డాయి అనుకొన్నాము. జీవితం ఒక చక్రం. ఆర్థిక హక్కుల కొరకు మాత్రమే పని చేస్తూపోతే స్వేచ్ఛ, స్వాతంత్ర్యం అవంతట అవి ఎప్పటికీ రావు. నన్ను, ఆనంద్ గ్రోవర్ నీ కలుపుకొని ఎంతోమంది కార్టూనిస్టులకీ, కవులకీ, విద్యార్థులకీ, దళితులకీ, రైతులకీ, భీమా కోరేగావ్ కేసులో దోషులు అయినవారికీ -- మాకందరికీ విముక్తి కోసం పోరాటం ఇప్పుడే ప్రారంభం అయ్యింది.

న్యాయవ్యవస్థ, ఎమర్జెన్సీ తరువాత ప్రజల దృష్టిలో దాని నమ్మకాన్ని నిలుపుకొనే యుద్ధం చేస్తూ ఇప్పుడు ఒక అస్థిరమైన స్థితికి చేరుకొన్నది. అది ప్రజా ప్రయోజన వాజ్యం (PIL) కు కావాలనుకొన్నప్పుడు తలుపులు తెరుస్తూ, వద్దనుకొన్నప్పుడు ఆ తలుపును గట్టిగా మూసివేస్తూ ఉంది.

ఈ కాలంలోనే మండల్ కమీషన్ ద్వారా స్థిరమైన కార్యాచరణ విధానాలు రంగంలోకి రావటం ఆశ్చర్యం కాదు. స్థిరమైన సమానత్వం తెచ్చే ఆలోచన ప్రాతిపాదికగా విద్యాసంస్థల్లో, సుప్రీం కోర్టు ఆదేశాల ప్రకారం పదోన్నతుల్లో కూడా రిజర్వేషన్లు రావటం అనే విషయం వివిధ ప్రజల జీవితాల్లో కొద్దిగా విస్తృతిని కల్పించాయి. ఈ రిజర్వేషన్ల ప్రాముఖ్యతను నొక్కి చెబుతూ జస్టిస్ చంద్ర చూడ్ ఇలా అన్నారు :

> *'భారత సమాజం లోతైన వ్యవస్థాపరమైన అసమానత్వంతో బాధపడుతోందనీ, మన రాజ్యాంగం దాన్ని అధిగమించి మార్పు చెందగల పత్రంగా మారగలదనీ చట్ట సభల్లోని సభ్యులు గుర్తించారని గట్టి రుజువు అవుతోంది. ఈ అసమానతలు పోవటానికి ఒక పద్ధతి ఎస్సీ, ఎస్టీలకు చట్ట సభల్లో, ప్రభుత్వ సర్వీసుల్లో రిజర్వేషన్లు ఇవ్వటం.'*

## LGBTQI (Lesbian, Gay, Bi Sexual, Transgender, Queer, Intersex) **పోరాటం – వ్యక్తిగత గోప్యత కోసం డిమాండ్**

ఇటీవల కాలంలో 'మార్పు చెందగల రాజ్యాంగశక్తి' చుట్టూ గట్టిగా మీమాంస అభివృద్ధి చెందుతోంది. ముఖ్యంగా LGBTQI హక్కులకు విషయంగా, అనేక జడ్జిమెంట్ల ద్వారా ఇది జరిగింది.

'నవ్ తేజ్ జోహర్ వర్సస్ భారత ప్రభుత్వ'కేసులో పండగ చేసుకోగల జడ్జ్ మెంట్ ను సుప్రీం కోర్టు ఇటీవల వెలువరించింది. ఈ సందర్భంగా 'మార్పు చెందగల రాజ్యాంగ శక్తి' రాజ్యాంగాన్ని అన్వయ పరుచుకొనే ఒక విషయంగా కోర్టు గుర్తించింది. మధ్యయుగాల, అంతరాల సమాజాన్ని సమ సమాజ ప్రజాస్వామ్యంగా మార్పు చేస్తూ రాజ్యాంగ పీఠికలో ఉన్న ఆదర్శాలను ఆలింగనం చేసుకొనే రాజ్యాంగం తెచ్చుకోవటమే దాని ఉద్దేశ్యం. చట్టబద్దమైన కోర్టుగా ప్రజలను అవమానాలు, వివక్షలనుండి కాపాడే బాధ్యత ఒక పక్క నిర్వహిస్తూ ఇంకోవైపు స్వేచ్ఛా సమానత్వపు హక్కులకు చలనం లేని అర్థాలను ఇస్తూ,హక్కుల పోరాటం విషయంలో మూగ సాక్షిగా మిగిలి పోకూడదని 'మార్పు చెందగల రాజ్యాంగ శక్తి'గురించి జస్టిస్ దీపక్ మిశ్రా నొక్కి వక్కాణిస్తూ ఇలా వ్యాఖ్యానించారు :

'రాజ్యాంగం మనకు ప్రాథమిక హక్కులుగా గ్యారెంటీ ఇచ్చిన హక్కులు

స్వేచ్ఛ సమానత్వాలకు సంబంధించిన కాలాతీత, చలనపూరితమైన హక్కులు. వాటికి చలన రహిత అన్వయింపు ఇచ్చి, వాటి మార్పు చెందే స్వభావాన్ని గుర్తించకుండా ఉండటం మన రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకం. ఈ హక్కులను స్థిరపరుస్తున్న సిద్దాంతాలు మారే కాలంతో మారుతాయని కాకుండా, మారుతున్న కాలాలు ఈ హక్కుల సిద్ధాంతాలను ప్రకాశింప చేస్తూ, అందరికీ అర్థం అయ్యేటట్లు చేస్తాయని గుర్తించాలి.'

ప్రతి తరం రాజ్యాంగం వారికి ఏమిచ్చిందీ అనే విషయాన్ని నిర్ణయించుకొనే హక్కువారికి ఉంటుందని నేను నమ్ముతాను. వారి ఆశలకు అనుగుణంగా రాజ్యాంగాన్ని అన్వయించు కొనే హక్కు కూడా వారికి ఉంటుందని కూడా నేను నమ్ముతాను.

సెక్షన్ 377 ను (LGBT సెక్షన్) నేరరహిత సెక్షన్ గా మార్చటానికి జరిగిన పోరాటం 20 ఏళ్ల క్రితం జరిగిందని మర్చిపోకూడదు. నవ్ తేజ్ కేసు (2018లో వచ్చిన ఈ కేసు జడ్జిమెంట్ లో సెక్షన్ 377 ను నేర రహిత సెక్షన్ గా సుప్రీం కోర్టు పేర్కొన్నది- అనువాదకురాలు)కంటే ముందు నాజ్ ఫౌండేషన్ కేసు(2009లో ఢిల్లీ హై కోర్టు ఇద్దరు మేజర్ల మధ్య యిష్టపూర్వక సెక్స్, అది హెూమో సెక్స్ అయినా కూడా, నేరం కాదని చెప్పింది- అనువాదకురాలు) లాయర్స్ కలెక్టివ్ సహకారంతో నడిచింది. నవ్ తేజ్ కేసు, నాజ్ ఫౌండేషన్ కేసుకు పునరుద్ఘాటన మాత్రమే.

నవ్ తేజ్ జోహర్ కేసు తీర్పు తరువాత కెఎస్ పుట్టస్వామి కేసు తీర్పు వచ్చింది. (పుట్టస్వామి రిటైర్డ్ ఐయేయస్. వయసు 90 సంవత్సరాలు. ఆధార్ కార్డ్ లో ఇస్తున్న వివరాలు మన వ్యక్తిగత గోప్యతకు భంగం కలిగిస్తున్నాయనే ఆయన పిటిషన్ మీద సుప్రీం కోర్టు పాజిటివ్ గా స్పందించింది- అనువాదకురాలు) మన రాజ్యాంగంలోని IIIవ భాగంలో ఇచ్చిన వ్యక్తిగత గోప్యతకు సంబంధించిన హక్కును ఎత్తి పట్టటంలో ఈ తీర్పు సహాయపడింది. గోప్యతకు సంబంధించిన కొన్ని రూపాలను ఇంకా కొన్ని వాస్తవ సందర్భంలో పరీక్షించాల్సి ఉండగా, ఈ తీర్పు వలన ఈ విషయం పై చర్చ ఆగకుండా కొనసాగే ప్రక్రియ ప్రారంభం అయ్యింది. వ్యక్తిగత గోప్యతకి సంబంధించిన హక్కుల నుండి విస్మరించే హక్కు వరకు ఈ చర్చ సాగుతుంది. ఈ చర్చ నేర న్యాయ వ్యవస్థ పని తీరు మీద ప్రభావం చూపిస్తుంది.

**జండర్ న్యాయం కొరకు పోరాటం**

పుట్టుస్వామి, NALSA (ట్రాన్స్ జండర్స్ ను మూడవ జండరుగా భావిస్తూ వారికి రాజ్యాంగం ఇచ్చిన హక్కులన్నీ ఇవ్వాలని సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు- అనువాదకురాలు), షాఫిన్ జహాన్ (ముస్లింను పెళ్లి చేసుకొని పేరుమార్చుకొన్న అఖిలా

కేసు. ఆ పెళ్లి చెల్లదని కేరళ హై కోర్టు తీర్పు ఇస్తే, సుప్రీం కోర్టు ఆమె పెళ్లిని లీగల్‌గా అంగీకరించింది– అనువాదకురాలు), నవ్ తేజ్ కేసుల్లో వేగంగా వచ్చిన తీర్పులు న్యాయ వ్యవస్థలో ఉన్న అభ్యుదయ శక్తులను ప్రతిబింబించాయి. కానీ అసలు సంగతి క్రూరంగా ఉందనటానికి ఎలాంటి సందేహం లేదు. వచ్చిన ఉపశమనం పరిమితమైనది. కోర్టులు ఇప్పటి ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఎలాంటి స్టాండ్ తీసుకోకుండా చాలా సార్లు పారిపోతున్నాయి.

1950 నుండి ఇప్పటి వరకూ వచ్చిన అనేక మహిళల హక్కులకు సంబంధించిన తీర్పులు న్యాయ వ్యవస్థకున్న ఈ పరిమితిని సంగ్రహంగా వివరిస్తాయి. శబరిమల, ట్రిపుల్ తలాక్ లాంటి తీర్పులమీద ప్రగతిశీల ప్రభావం ఉంది. తార్కికత, మరింత మార్పు చెందే స్వభావంతోనూ, కఠినంగా ఉండాలని ఈ తీర్పులు మనకు సూచిస్తున్నాయి.

నరస అప్పు కేసు నుండి మొదలు పెడితే (ఈ కేసు సందర్భంగా బాంబే హై కోర్టు వివాహానికి సంబంధించిన పర్శనల్ చట్టాలు కోర్టు పరిధిలోకి రావని తీర్పు ఇచ్చింది– అనువాదకురాలు) అనేక కేసులు, పర్సనల్ చట్టాలు మన రాజ్యాంగంలోని ఆర్టికల్ 13 పరిధిలోకి రావని చెప్పే పనిలో లైంగిక సమానత్వపు ప్రశ్నను విస్మరించాయి. నరస అప్పు దెయ్యం ఇప్పటికీ సుప్రీం కోర్టును ఆవహించి ఉంది. ఆడవాళ్ల హక్కుల విషయంలో ఆ దెయ్యం మరీ ఆవహించింది. ఈ కేసులలో కోర్టు నిర్ణయాన్ని మేరీ రాయ్ (అరుంధతి రాయ్ తల్లి– అనువాదకురాలు), గీతా హరిహరన్, షాబానో, గూల్రోఖ్, శబరిమల, ట్రిపుల్ తలాక్ కేసులు సవాలు చేశాయి. కానీ కోర్టు ప్రశ్నను దాట వేసింది. సమానత్వాన్ని పొందటానికి మహిళలు దాటవలసిన చివరి అడ్డంకిగా మతం మిగిలిపోయింది.

ఒక్క శబరిమల కేసులోనే కోర్టు నరసు అప్పు దెయ్యాన్ని కొంత వరకు వదలగొట్టుకొని, ఈ ప్రశ్నను పట్టించుకోవాల్సి వచ్చింది. ఈ అనుకూల తీర్పులో, మహిళలకు దేవాలయాలలోకి ప్రవేశం ఇవ్వక పోవటం అంటరానితనానికి సమానమని జస్టిస్ చంద్ర చూడ్ అన్నారు. ఎక్కువ మంది ఈ వాదనను విస్మరించారు. బహిష్టు నిషేదాలను అంతరానితనంగా పేర్కొన్నందుకు, నన్ను దళితుల పోరాటాలను తక్కువ చేస్తున్నాననే పేరుతో విమర్శించారు. నా ప్రశ్న: అది అంటరానితనం ఎందుకు కాదని? దళితుల అంతరానితనం సందర్భంగా మన రాజ్యాంగంలో ఆర్టికల్ 17 ప్రవేశపెట్టారు. అయితే ఇప్పుడు కొత్త రూపాలలో నూతన అంటరానితనాలు మొలకెత్తుతున్నాయి. నా కుటుంబంలోనే ఇలాంటి అంటరానితన రూపాన్ని దర్శించిన సాక్షిని నేనే. నా చిన్ననాటి ఆ జ్ఞాపకాలు పెద్దయినా కూడా నా మీద ప్రభావం వేశాయి.

గూల్రోఖ్ కేసు భయంకరమైన విషయాన్ని ముందుకు తెచ్చింది. పెళ్లైన తరువాత

భర్త మతాన్ని పొందాలా, లేదా అనే విషయం చుట్టూ ప్రశ్న తిరిగేటట్లు గుజరాత్ కోర్టు చేసింది. సుప్రీం కోర్టు ఈ ప్రశ్నకు ఇంకా సమాధానం ఇవ్వలేదు. భర్త మతమే భార్యకు వస్తుందని గుజరాత్ కోర్టు చెప్పింది. కాబట్టి ఒక మహిళకు పుట్టుకతో తండ్రి మతం, పెళ్ళైయ్యాక భర్త మతం వస్తాయన్నమాట.

ట్రిపుల్ తలాక్ విషయంలో ఎందుకు ట్రిపుల్ తలాక్ ని అడ్డుకోవాలనే విషయంలో సుప్రీం కోర్టుకు భిన్న అభిప్రాయాలు ఉన్నాయి. ఇద్దరు జడ్జిలు ఆ ఆచరణను రాజ్యాంగ విరుద్ధం అంటే, ఒక జడ్జి దాన్ని ఇస్లాం విరుద్ధం అన్నాడు. ఎవరూ దాన్ని ఆర్టికల్ 15, 21 లకు విరుద్ధం అని చెప్పలేదు. 'తప్పనిసరి ఆచరణల సిద్ధాంతం' మీద కోర్టులు ఆధారపడుతూ, వివక్షకు మూలకంగా ఉండే న్యాయ చట్టాల అలవాటుగా అవి కొనసాగుతున్నవి. అలా మహిళల హక్కుల ప్రశ్న ముందుకు వచ్చినపుడు కోర్టులు చాలా నిరుత్సాహపరుస్తుంటాయి.

**వ్యక్తుల మధ్య సంబంధాలు**

షాఫిన్ జహాన్ కేసు వ్యక్తుల మధ్య మారుతున్న సంబంధాల గురించి చెబుతుంది. అఖిలా అనే 24 సంవత్సరాల హిందూ మహిళను బ్రైన్ వాష్ చేసి, మెదడును ప్రోగ్రాం చేసి, ముస్లింగా మారేటట్లు శిక్షణ ఇచ్చి, ముస్లింను పెళ్లాడేటట్లు చేశారనే వాదనలు మొదలైయ్యాయి. హిందూ మహిళ ముస్లిం పురుషుడుని పెళ్లి చేసుకోకుండా రక్షించటానికి ఆర్ ఎస్ ఎస్ పూర్తి బలంతో సిద్ధమైయ్యింది. అయితే కోర్టు ఆమెతో సంప్రదించాలని సూచించగానే,అఖిలా సుప్రీం కోర్ట్ లో న్యాయమూర్తులు దీపక్ మెహ్రా , చంద్ర చూడ్, ఖన్విల్కర్ ల ముందు నిలబడింది. ఆమెను ప్రశ్నించగానే,'నా స్వేచ్ఛ నాకు కావాలి' అనే ఆమె స్పష్టమైన గొంతు కోర్టులో ప్రతిధ్వనించింది. అప్పుడు కోర్టుకు ఏమైనా వేరే ఛాయిస్ ఉంటుందా? లేదు. ఆమె తన చదువును కొనసాగించాలని అనుకుంటుందా అని అడగగానే 'నా నమ్మకం, నా చదువు రెండూ నాకు కావాలని' ఆమె చెప్పింది. ఆమెను కాలేజ్ హాస్టల్ కి పంపాలని నిర్ణయం జరగగానే 'నేను ఏదైనా చర్చించాలని అనుకొన్నప్పుడు నా భర్తతో మాట్లాడే అవకాశం నాకివ్వాలి. నాకు ఆయన సాహచర్యం కావాలి' అని కూడా చెప్పింది.

లైంగిక సమానత్వం కోసం ఇప్పటికీ చేయరావాల్సి వచ్చిన ఈ పోరాటం బహుశా 'మార్పు చెందగల రాజ్యాంగశక్తి' విఫలం అయిన కథ అయి ఉంటుంది.

**నరకం నుండి సమస్య**

పని స్థలాల్లో లైంగిక వేధింపులు, ముఖ్యంగా న్యాయవ్యవస్థలో పని చేస్తున్న మహిళలకు 'నరకం నుండి వచ్చే సమస్య' గా మిగిలిపోయింది. న్యాయమూర్తి అనుభవిస్తున్న

'న్యాయ ప్రక్రియ నుండి శిక్ష తప్పించుకొనే అవకాశం', లైంగిక వేధింపులు చేసిన న్యాయమూర్తులను న్యాయ స్థానానికి లాగటం అనే పనిని అసాధ్యం చేస్తుంది. తమను వేధిస్తున్నారని చెబుతున్న జడ్జిలకు వ్యతిరేకంగా ఈ దేశంలో మహిళా జడ్జిలు, మహిళా ఉద్యోగినులు, శిక్షణ పొందుతున్న మహిళలు ఉండాలని అనుకొంటాను. పదవిలో ఉన్న ఒక జడ్జి నేరారోపణకు గురి అయినపుడు (ఆ ఆరోపణ నిలబడలేదు) నాకు హై కోర్టు న్యాయమూర్తులను క్రాస్ పరీక్ష చేసే అవకాశం వచ్చింది. దాని ఫలితం నాకు మొత్తం న్యాయ వ్యవస్థ మీదనే నమ్మకం పోయింది. ఒక మహిళా జడ్జిని వేధింపులకు గురి చేసి, తరువాత ఆమె బదిలీ చేసే ప్రక్రియలో పాత్ర వహించిన ఆ కేసులో నేను క్రాస్ పరీక్ష చేసిన ఒక జడ్జి తరువాత కాలంలో ఒక హై కోర్టుకు ప్రధాన న్యాయమూర్తి అయ్యాడు. ఇప్పుడు అతన్ని సుప్రీం కోర్టులో నియామకం చేసే విషయం గురించి సీరియస్ గా ఆలోచిస్తున్నారు. 'మీ టూ' ఉద్యమం ఈ దేశంలో మహిళలకు ఎలాంటి నిర్దిష్టమైన ఫలితాలను ఇవ్వలేదని గుర్తించాలి. సమంతా పవర్ మానవ హననం గురించి రాసిన నవల పేరు 'నరకం నుండి సమస్య'. ఇప్పుడు ఆ సమస్య మనల్ని పీడిస్తూనే ఉంది.

## మూక హత్యల విషయాన్ని కోర్టు వరకూ లాగిన తుషార్ గాంధీ

నాకిచ్చిన పరిమిత సమయంలో నిజాలనూ, లెక్కలనూ మళ్లీ మళ్లీ చెప్పనవసరం లేదు. నేను చెప్పదలుచుకొన్నది ఏమిటంటే మూక హత్యలు లా అండ్ ఆర్డర్ సమస్య కాదు. అవి మత ప్రాతిపదికన ఎక్కుబెట్టబడిన సంగతులు. అలా అవి రాజ్యాంగపరమైనవి, దేశ సమాఖ్యకు సంబంధించినవి. వాటికి ప్రభుత్వమే బాధ్యత వహించాలి. యుకె, కెనడా ప్రభుత్వాలు ఈ మధ్య మీడియా స్వేచ్ఛ మీద నిర్వహించిన సదస్సులో The Caravan పత్రిక ఎడిటర్ వినోద్ జోస్ ఈ సంఘటనల గురించి వ్యాఖ్యానించాడు. 'ఇలాంటి చర్యలు యాదృచ్ఛికంగా జరగవు. మతపరమైన మైనారిటీల మీద దీర్ఘ కాలంగా పెంపొందిన ద్వేషం, అసహనం వలన ఇవి జరుగుతాయి' అన్నాడు. ప్రస్తుత పాలన మీద తన అసంతృప్తిని వెలిబుచ్చినందుకు వినోద్ జోస్ ను అవమానించి, అపకీర్తి పాలు చేశారు.

## విద్యార్థుల మీద దాడులు

గత ఐదు సంవత్సరాలు,వివిధ యూనివర్శిటీల నుండి వచ్చిన విద్యార్థుల మీద జరిగిన గణనీయమైన దాడులను వీక్షించాయి. వారిలో రోహిత్ వేముల, నజీబ్, కన్నయ్య కుమార్, ఉమర్ ఖాలిద్, పాయల్ ఎక్కువ బాధితులు. 'యాంటీ నేషనల్' అనే శాపనార్థం' ఇప్పుడు కొత్తగా బయటకు వచ్చింది. కన్నయ్య కుమార్ మీద దాడి జరిగినపుడు, మన భారత పీనల్ కోడ్ లో ఎక్కడా 'యాంటీ నేషనల్' అనే నేరం లేదని నేను చెప్పాను. అలాగే 'అర్బన్ నక్సలైట్' అనే నేరం కూడా మన పీనల్ కోడ్ లో లేదు. అయినా కూడా

మనలో చాలా మందిమి అర్బన్ నక్సలైటులుగా, యాంటీ నేషనల్స్ గా వచ్చే కొలది గుర్తింపుకు నోచుకొంటున్నాము.

## ఎస్టీ ఎస్సీ చట్టాన్ని నీరు కార్చడం

ఎస్టీ ఎస్సీలకు అనుకూలంగా ఉన్న చట్టాన్ని నీరుకార్చినందుకు, సుభాష్ మహాజన్ కేసులో సుప్రీం కోర్టు తీవ్ర విమర్శలకు గురి అయ్యింది. ఈ చట్టాన్ని ఎస్సీ ఎస్టీ సమూహం దుర్వినియోగ పరుస్తుందని చెబుతూ ఈ తీర్పు ఇవ్వడం ఇంకా భయాన్ని కలిగిస్తుంది. ఆయా సమూహాలు,తమపై జరుగుతున్న అణచివేత గురించి అబద్దాలు ఆడుతున్నారనటం ఈ భయం కలగడానికి కారణం. స్త్రీలు, ఎస్సీ ఎస్టీ సమూహాలు, మైనారిటీలు, మానవ హక్కుల రక్షకులు అందరూ చట్టం ముందు అబద్ధాలు ఆడుతున్నారంటే, మరి నిజం మాట్లాడుతున్నది ఎవరు?

## మానవ హక్కుల కాపలాదారులు, న్యాయ వృత్తిలో ముందు భాగాన ఉండి కాపాడే వారి మీద దాడి

ఈ సుదీర్ఘ దాడుల పరంపరలో ఇటీవల టార్గెట్ అయిన వాళ్లు రాజ్యాంగ విలువలను కాపాడేమానవహక్కుల కాపలాదారులు, లాయర్లు. దేశంలో మానవహక్కుల పరిరక్షకులు లేక పోతే ఏమౌతుందో ఊహించండి. మన అద్రృష్టం కొద్ది చాలా మంది ఇక్కడ ఉన్నారు. ఈ లాయర్ల మీద దాడి అంటే అది న్యాయ పరిరక్షణ హక్కు మీద దాడి. మనం న్యాయ వ్యవస్థ స్వతంత్రత గురించి మాట్లాడటం అంటే, అది న్యాయ వృత్తి స్వతంత్రత గురించి మాట్లాడటం కూడా అవుతుంది. న్యాయ వృత్తి మీద దాడిని న్యాయ వ్యవస్థ ఒప్పుకొంటే, దాని మీద అది దాడి చేసుకొన్నట్లే. ఈ దాడుల పర్యవసానం, అందరితో పాటు, లాయర్ల కలెక్టివ్, నేను అనే ఇందిరా జైసింగ్, ఆనంద్ గ్రోవర్ కూడా ఉన్నాము. సున్నితమైన కేసులను తీసుకొని, ప్రతిష్ట కలిగిన వ్యక్తులకు వ్యతిరేకంగా మాట్లాడినందుకు మేము బాధితులం అయ్యాము. మా కంటే ముందు సురేంద్ర గాడ్లింగ్, సుధా భరద్వాజ్, గుజరాత్ లో 2002 మతదాడుల తరువాత పని చేసిన తీస్తా శతల్వాడ్ ఉన్నారు. ఎఫ్‌సిఆర్ఏ ఫండ్స్ ను ఉపయోగించి ప్రజాస్వామ్యాన్ని తక్కువ చేశామని లాయర్ల కలెక్టివ్ మీద, దాని ఆఫీస్ బేరర్ల మీద సిబిఐ దాడులు పురమాయించబడ్డాయి. ఇవి జరిగిన పద్దతులు, వీటి వెనకాల రాజకీయ కుట్ర ఉన్నదనే విషయాన్ని నిర్ధారిస్తాయి. పశ్చిమ బెంగాల్ పోలీస్ కమిషనర్ కేసులో వాదిస్తూ నేను 'ఈ దేశంలో నేరంపై ప్రశ్నించడం నుండి తప్పించుకోవాలంటే అధికార యంత్రాంగంలో భాగమవటం ఒక మార్గం' అని అన్నాను. ఇంతకంటే నేను ఇంకా ఏమి చెప్పాలి?

## ముగింపు :

నాకు జీవిత చక్రం పూర్తి అయ్యింది. నేను ముందే చెప్పినట్లుగా నేను అర్ధ రాత్రి విహరించే ఒక పిల్లను. స్వేచ్ఛ, స్వతంత్రం, విముక్తి నాకు ఉన్నాయనే అనుకొంటాను. వాటిని పారంపర్య హక్కులుగా నేను పొందాను. మేము లాయర్ల కలెక్టివ్ గా మా యుద్ధం కేవలం ఆర్థిక న్యాయం కోసమే అనుకోని అటు వైపు పని చేశాము. ఈనాటికి నా స్వేచ్ఛ ఒక భ్రాంతి అని అర్థం అయ్యింది. నా హక్కులకు గ్యారంటీ ఉన్నదని అనుకోవటం నా తెలివితక్కువతనం. భావ వ్యక్తీకరణ స్వేచ్ఛను వాళ్లకు అప్పగించేసి, పేదరికాన్ని తుడిచిపెట్టలేము. పీడన నుండి విముక్తి కావటానికి భావ వ్యక్తీకరణ స్వేచ్ఛ ఒక ముందస్తు షరతు.

బహుశా నేను ఎక్కువ కాలం జీవించానేమో. కోర్టును ఒక విముక్తికారిణిగా నేను చూశాను. కోర్టును ఒక పీడకురాలిగా కూడా నేను చూశాను. ఆర్టికల్ 32 కింద ఫైల్ అయిన ఏ ఫిర్యాదు కింద అయినా ఒక ప్రాథమిక హక్కు తప్పక ఉల్లంఘనకు గురి అవుతుందని రాజ్యాంగ చట్టపు విద్యార్థులు గుర్తించాలి.

మా దృష్టిలో మార్పు చెందగల రాజ్యాంగశక్తి  అంటే వ్యక్తిగత స్వేచ్ఛ. భావ వ్యక్తీకరణ స్వేచ్ఛా హక్కు ఇప్పుడు హక్కుల్లో కెల్లా ప్రమాదమైనది.

సిబిఐ మా మీద కేసు రిజిస్టర్ చేసిందని తెలిసీ,'మార్పు చెందగల రాజ్యాంగశక్తి' అనే విషయం మీద ప్రారంభ ఉపన్యాసం ఇవ్వటానికి నన్ను పిలిచి గౌరవించిన మీకు లాయర్ల కలెక్టివ్ తరఫున కృతజ్ఞతలు. జీవితం మారిపోయింది. నేను ఒంటరిగా ఇక ప్రయాణం చేయనవసరం లేదు. నా చుట్టూ నాతో కలిసి ప్రయాణం చేయటానికి కోరి ఇష్టపడే లాయర్లు ఉన్నారు. న్యాయ వృత్తిలో నా విజయం వారితోనే ఉంది. నా వైపు నుండి నేను నిర్వహించిన పాత్ర కూడా వారిని తయారు చేయడమే.

**జై హింద్. స్వేచ్ఛ కలకాలం వర్ధిల్లు కాక.**

---

"ఇక్కడ ప్రజాస్వామ్యం చాలాకాలంగా వాడుకలోలేని మూలంగా ఇది ఏదో కొత్తగా కనిపిస్తుంది. ప్రజాస్వామ్యం నియంతృత్వానికి దారితీసే ప్రమాదం వుంది. ఇప్పుడే పుట్టిన మన ప్రజాస్వామ్యం తన స్వరూపాన్ని అలా వుంచుకొంటూనే ఆచరణలో నియంతృత్వానికి దారితీయవచ్చు. ఈ దిగజారుడు ప్రారంభమయితే జరిగే రెండో ప్రమాదం మరీ పెద్దదిగా వుంటుంది."

– బి.ఆర్. అంబేద్కర్

# 7. ఇండియా రాజ్యాంగం - నాడు - నేడు

– **అరుణాంక్ లత**, డెమోక్రటిక్ స్టూడెంట్ యూనియన్ (డి.యస్.యు.),
గోదావరిఖని, సెల్ : 8143916151

1949 నవంబర్ 26 ఇండియా రాజ్యాంగ ముసాయిదాని సభలో చర్చించి ఆమోదించిన రోజు. ఇది 1950 జనవరి 26 నుండి అమలులోనికి వచ్చింది.

ఈ సందర్భంగా విభిన్న రకాల చర్చ జరిగింది. ఈ సభలో డా॥ బి.ఆర్. అంబేద్కర్ మాట్లాడుతూ..

"1950 జనవరి 26న మనం వైరుధ్యాలమయమయిన జీవితంలోకి ప్రవేశించబోతున్నాం. రాజకీయాల్లో మనకు సమానత్వం ఉంటుంది. ఆర్థిక జీవనంలో అసమానత ఉంటుంది. రాజకీయంగా ఒక మనిషికిఒకే ఓటు, ఒక ఓటుకి ఒకే విలువ ఉంటాయి. మన ఆర్థిక రాజకీయ వ్యవస్థ మూలంగా మన సామాజిక, ఆర్థిక జీవనంలో మనం ఒక మనిషికి ఒకే విలువ అన్న సూత్రాన్ని నిరాకరిస్తూనే ఉంటాం. ఈ వైరుధ్యాన్ని వీలైనంత త్వరగా తొలగించి తీరాలి. లేకపోతే, ఎంతో శ్రమించి నిర్మించిన రాజకీయ ప్రజాస్వామ్య సౌధాన్ని అసమానతలు అనుభవిస్తున్నవారు ధ్వంసం చేస్తారు" అని అన్నాడు.

కానీ అంబేద్కర్ సమకాలికులు పెరియార్ మాత్రం అది అమలులోకి వచ్చిన రెండు సంవత్సరాల 8 నెలల 8 రోజుల్లోనే (1952 ఆగస్టు 7, 8 తేదీలలో) వేలాదిమంది సమక్షంలో ఈ రాజ్యాంగాన్ని తగులబెట్టి అరెస్ట్ అయ్యాడు. జైల్లో కూడా ఉన్నాడు. ఈ సందర్భంగా ఆయన ఇచ్చిన ఉపన్యాసం ఇది :

"ఇప్పుడున్న ఇండియా బ్రిటిష్ రాకమునుపు ఒక్కటిగా ఉందని ఎవరైనా అనగలరా? ద్రావిడ నేలని ద్రావిడులు కానివారు ఎవరైనా పరిపాలించారా? బ్రిటిష్‌వాడు తన సౌలభ్యం కోసం తాను గెలిచిన ప్రాంతాలన్నింటినీ ఏకం చేశాడు. దానికి ముస్లింలు ఇచ్చిన పేరును పెట్టాడు. ఏదో ఒక రీతిని ఈ 'జాతి' (నేషన్ అనే మాటకు అర్థం అదే. జాతి రాజ్యాల భావన ఉన్నది) ఈనాడు వాస్తవ రూపంలోకి వచ్చింది. కానీ మొఘల్, బ్రిటిష్ పాలన వలనే దోపిడీ చేయడం ఎట్లా సమంజసం. మీరు మీ భాషను మాపై వారిలానే రుద్దుతున్నారు. (హిందీ భాష అని పెరియార్ అభిప్రాయం అనుకుంటా)

ఇది మీకై మీరు రాసుకున్న రాజ్యాంగం. ఇది మనుస్మృతి లాంటిది. దానిలాగే మార్చడానికీ, ఇంట్రవెన్షన్ కావడానికీ వీలు లేనిది. ఈ పుస్తకం పేరుమీద మీరు మమ్మల్ని నిలువరించడం, అణచివేయడం మొదలుపెట్టారు. రాజ్యాంగం ప్రకారం ఎవరూ దోపిడీని

వ్యతిరేకించరాదు. మేము జాతులకు స్వాతంత్ర్యం అడగరాదు. మేము రిజర్వేషన్లు అడగరాదు. మీరు వీటన్నింటినీ 'చట్ట ప్రకారం నేరాలు'గా పేర్కొన్నారు.

ఈ రోజు నేను ఈ రాజ్యాంగాన్ని ఆమోదించడం లేదు అని ప్రకటించదలిచాను. ఇది మాకు విరుద్ధమైనది. ఇది మా ప్రతినిధులు లేకుండా తయారుచేయబడింది. మేము దీన్ని కాలబెడతాం.

ఎవరి సమ్మతితో, ఎవరితో కలిసి ఈ రాజ్యాంగాన్ని తయారుచేశారు? మీరు ఎన్నికలను బ్రిటిష్ వలనే ధనికులకు, విద్యావంతులకు మాత్రమే నిర్వహించారు. ఎన్నికల్లో గెలిచిన వారే రాజ్యాంగాన్ని తయారుచేశారు. గుర్తుంచుకోండి. ఈ ఓట్ల వ్యవస్థలో బ్రిటిష్ తయారుచేసిన అన్ని చట్టాలను మీకై మీరే బహిష్కరించారు.

ఇద్దరూ, ముగ్గురూ, నలుగురూ బ్రాహ్మణులు, ఐదుగురు ధనికులు వారి సేవకులు ఈ జాతి (దేశాని)కి ప్రతినిధులుగా ఉంటారా? ఈ దేశ మెజారిటీ ప్రజలైన పేదల ప్రాతినిధ్యంతో ఈ రాజ్యాంగం తయారుచేయబడిందా? 21 ఏళ్ళు దాటినవారు ఎన్నుకునే ప్రతినిధులతో ఈ రాజ్యాంగం తయారుచేయబడుతుంది అని ఈరీబ్ 1946లో ప్రకటించారు. మీరు అది చేశారా?

హడావిడిగా వెళ్ళిపోతూ మీ చేతిలో బ్రిటిష్ అధికారం పెట్టినందుకు మీరు అన్నిటి నుండి బయటపడగలరని నిజంగా అనుకుంటున్నారా? మమ్మల్ని శాశ్వతంగా అణచివేసేందుకు, దోపిడి చేసేందుకు మీరు రాజ్యాంగాన్ని నిలబెట్టారు. ఇంకా ముందుకు వెళ్ళి దీన్ని మాపై రుద్దుతారా? బ్రిటిష్ నుండి 'స్వాతంత్ర్యం' అడిగినప్పుడు ఇల్లా చేస్తాం అని చెప్పారా?

అందుకే, మేము రామాయణం, మహాభారతం, గీత, ప్రబంధాలు మొదలైనవాటిని తగలబెట్టినట్లుగానే తగలబెడతాం. మా నిత్య జీవితానికి ఆచరణకు పనికిరానివి, హానికరమైనవని తగలబెట్టినట్లుగానే అధికారంలో ఉన్నవారు ఈ దేశ ప్రజలను బానిసలుగా చేసుకొని దోపిడీ చేసేందుకు సులభతరం చేసిన ఈ రాజ్యాంగాన్ని మేం కాలబెడతాం. అవును. మేం చేస్తాం.

(చెన్నయ్ బీచ్‌లో రాజ్యాంగాన్ని కాలబెడుతూ పెరియార్ చేసిన ప్రసంగానికి స్వేచ్ఛానువాదం)

అంబేద్కర్ అభిప్రాయంలో చూసుకున్నా, పెరియార్ అభిప్రాయంలో చూసుకున్నా ఇప్పటికీ దేశంలో వైరుధ్యాలు సమసిపోలేదు. "ఇద్దరూ, ముగ్గురూ, నలుగురూ బ్రాహ్మణులు,

ఐదుగురు ధనికులు వారి సేవకులు ఈ జాతి (దేశాని)కి ప్రతినిధులుగా ఉంటారా?" అని పెరియార్ వేసిన ప్రశ్నకు నేటికీ ప్రాసంగికత ఉన్నది. అయితే రాజ్యాంగం మార్చడానికి వీలు ఉన్నది. అందులో ఇంటర్వెన్షన్ అయ్యే వీలూ ఉన్నది. దాన్ని ఆసరాగా తీసుకొనే నూట ఇరవై నాలుగుసార్లు దీన్ని మార్చారు. మార్చిన ప్రతిసారీ పాలకవర్గ ప్రయోజనాలే ఉన్నాయి. ఇప్పుడు కొత్తగా చేసిన సవరణ ఒక ప్రాంతం, అక్కడ నివసించే జాతికి హామీపడ్డ ఒప్పందాన్ని కాలరాసింది. మొత్తం కాశ్మీర్‌ని సైన్యం పహారాలో, నిగాలో ఉంచింది. 144 సెక్షన్ అమలు జరుగుతున్న రోడ్లను చూపించి ఇక్కడ నిరసనలు ఏమీ జరగడం లేదంటుంది రాజ్యం.

"పాలకవర్గం నిరంకుశంగా వ్యవహరిస్తున్నప్పుడు బూర్జువా చట్టాలను కాపాడుకోవడం మన బాధ్యత" అన్నాడు మార్క్స్. ఇప్పుడు పాలకవర్గం ఒకే దేశం - ఒకే పన్ను అని జిఎస్టీ తెచ్చింది. అది మధ్య తరగతిని, అసంఘటిత కార్మిక రంగంలో పనిచేస్తున్న కార్మికులను దెబ్బతీసింది. ఒకే దేశం - ఒకే రాజ్యాంగం అంటూ కాశ్మీర్‌కి ఉన్న ప్రత్యేక అధికారాలను రద్దు చేసింది.. రేపు ఈశాన్య రాష్ట్రాలకు ఉన్న ప్రత్యేక అధికారాలనూ రద్దు చేసినా చేయొచ్చు. ఆ మధ్య ఒకే దేశం - ఒకే భాష అనే నినాదం తెచ్చింది. దాన్ని దక్షిణ భారతీయులు, హిందీయేతర రాష్ట్రాల వాళ్ళు వ్యతిరేకించారు. వీటన్నిటి వెనక ఒకే దేశం - ఒకే మతం అనే భావన ఉన్నది. సెక్యులర్ పార్టీ అని తనకు తాను పిలుచుకునే కాంగ్రెస్ కూడా దీనికి అతీతం కాదు. రాజీవ్ గాంధి "హింద్ కరేగా హింద్ రాజ్" అనే నినాదం ఇచ్చిన విషయం మనం మరచిపోకూడదు. బీజేపీ బాహాటంగానే ఇది హిందువుల రాజ్యం అని చెబుతున్నది. మూడేండ్ల కిందట గోవాలో జరిగిన హిందూ సమ్మేళనం "ఇండియా రాజ్యాంగాన్ని మార్చి మనుస్మృతినే రాజ్యాంగంగా ప్రవేశపెట్టాలి" అని తీర్మానం చేసింది. ఆ మీటింగ్‌కి ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి యోగి ఆదిత్యనాథ్ కూడా హాజరయ్యాడు. రాజ్యాంగం పట్ల దాని రచన కమిటి ఛైర్మన్ అంబేద్కర్‌తో సహా, పెరియార్, వామపక్ష, విప్లవ సంఘాలకు అనేక పేచీలు ఉన్నా అది హామీ పడ్డ జీవించే హక్కు, సమానత్వపు హక్కు, వాక్, సభా స్వాతంత్ర్యపు హక్కులను కాపాడుకునేందుకు ఇప్పుడు రాజ్యాంగం అవసరం. నలభై రెండో సవరణ ద్వారా రాజ్యాంగ పీఠికలో చేర్చిన సోషలిస్ట్, సెక్యులర్‌గా ఈ దేశం ఏనాడూ లేకపోయినా ఆ స్పిరిట్ నైన కొనసాగించమని అడిగేందుకు ఇప్పుడు రాజ్యాంగం అవసరం. ఆదేశిక సూత్రాలలో ప్రాథమిక హక్కులలో మిగిలున్న ప్రజాస్వామ్యాన్ని కాపాడుకునేందుకు రాజ్యాంగం నేటి అవసరం. ఆ ప్రజాస్వామ్యమే సోషలిజానికి బాట వేస్తుంది గనుక.

---

# 8. భారత రాజ్యాంగ నిర్మాణంలో నారీమణులు

– **యం.వి. భరతలక్ష్మి,** ఆల్ ఇండియా ఉమెన్స్ కాన్ఫరెన్స్ (ఏ.ఐ.డబ్ల్యు.సి.)
కాకినాడ, సెల్ : 7013150444

భారతదేశ తొలి స్వాతంత్ర్యపు పోరాటం (1857)లో ఆంగ్లేయులతో వీరోచితంగా రణరంగంలో పోరాడి అశువులు బాసిన రాణీ ఝాన్సీ లక్ష్మీబాయి భారతీయులందరికీ ఉద్యమ స్ఫూర్తి నిచ్చింది. యుక్త వయస్సులో భర్తను కోల్పోయిన రాణీలక్ష్మీబాయి బ్రిటిష్ పాలకులకు లొంగకుండా తన పసిబిడ్డను వీపుకు కట్టుకొని, అశ్వరూఢయై, ఖడ్గం చేతబట్టి, యుద్ధభూమిలో స్వైర విహారం చేస్తున్న ఆమె చిత్తరువు ఈ తరం వారికీ పరిచితమే! కొన్ని దశాబ్దాల తర్వాత గాంధీజీ నాయకత్వంలో స్వాతంత్రోద్యమంలో పురుషులతోపాటు అనేకమంది స్త్రీలు సత్యాగ్రహాల్లో పాల్గొని సహాయ నిరాకరణోద్యమం చేపట్టి, లాఠీ దెబ్బలకోర్చి, జైళ్ళపాలై, అనేక కష్టాలు భరించి, ఆఖరికి ప్రాణాలు కోల్పోయిన ధీర వనితలెందరో! ఆసేతు హిమాచలం వాడవాడల్లో శాంతియుత స్వాతంత్ర్య పోరాటం కొనసాగింది. చరిత్ర ద్వారా మనకు తెలిసిన స్త్రీలు బహుకొద్దిమంది, కస్తూర్బాగాంధీ, కమలా నెహ్రూ, విజయలక్ష్మి పండిట్, తెలుగింటి కోడలు సరోజినీ నాయుడు తెలుగువారి ఆడపడుచు దుర్గాబాయ్ దేశ్‌ముఖ్. వీరితో పాటు ఎంతోమంది రాజవంశానికి చెందిన వనితలు రాజకుమారి అమృత్‌కౌర్ బేగమ్ అయనాజ్ రసూల్, కులీన స్త్రీలు హంసామెహతా, రేణుకా రే, లాలారాయ్, మాలతి చౌదరి, సమాజంలో అంటరానివారిగా వెలివేయబడిన దాక్షాయని వేలాయుధన్ వంటి మహిళలెందరో స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొంటూ, క్రియాశీల రాజకీయ, సాంఘిక, సాహిత్య, విద్యారంగాల్లో సేవ చేశారు. భారత రాజ్యాంగాన్ని రూపొందించిన రాజకీయవేత్తలైన పురుషులను చరిత్ర ఉటంకించింది. గాని, 'భారత రాజ్యాంగ రూప శిల్పి', 'భారత రాజ్యాంగ పిత' గా వినుతికెక్కిన డా॥ బి.ఆర్. అంబేద్కర్‌తో ఎన్నో చర్చలు జరిపి, మౌలికమైన సంస్కరణలు రాజ్యాంగంలో చేర్చడానికి తోడ్పడిన పదిహేనుమంది మహిళలను చరిత్ర విస్మరించింది. వీరంతా అకుంఠిత దీక్షతో, కుల, మత, సాంఘిక కట్టుబాట్లను అధిగమించి జాతిసేవకు అంకితమైనారు. వీరిలో విద్యావేత్తలు, న్యాయవాదులు, రాజకీయవేత్తలు ముఖ్యంగా సామాజిక సేవికలు ఉన్నారు. అలంకార ప్రాయంగా ఉంటారని స్త్రీలను రాజ్యాంగ నిర్మాణంలో తీసుకొని ఉంటారని వ్యాఖ్యానించిన ప్రబుద్ధులు లేకపోలేదు. నాటి మహిళల ప్రజ్ఞాపాటవాలు, ఈనాటి సగటు మనుష్యుల ఊహకందని విషయం. రాజ్యాంగ పరిషత్తు (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ)లో దేశంలో గల వివిధ జాతులు, మతాలు కులాల వారందరికీ ప్రాతినిధ్యం ఇవ్వాలని నిర్ణయించారు. ముస్లిములు, మహిళలు, షెడ్యూలు కులాలు,

షెడ్యూలు జాతులు, పార్శీలు, ఇండియన్ క్రిస్టియన్లు, ఆంగ్లో – ఇండియన్లు వీరందరిలో మేధావంతులైన వారిని మాత్రమే రాజ్యాంగ నిర్మాణానికి ఎంపిక చేయడంలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటి ప్రత్యేక శ్రద్ధ వహించింది. ఈ మేధో యజ్ఞంలో పాల్గొన్న మహిళల గురించి తెలుసుకొనే ముందు అసలు భారత రాజ్యాంగాన్ని రూపొందించాలన్న ఆలోచన ఎప్పుడు, ఎవరికి వచ్చింది? ఎలా రూపుదాల్చింది? ఈ విషయాలను ఓసారి పరిశీలిద్దాం. 1934లో ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు యమ్.యన్.రాయ్ స్వాతంత్ర్యం వచ్చేలోగా మన దేశానికి మనమే రాజ్యాంగాన్ని రూపొందించాలని ప్రతిపాదించారు. ఈ ప్రతిపాదనను సమర్థిస్తూ సి. రాజగోపాలాచారి (రాజాజీ) బ్రిటిష్ – ఇండియా రాజ్యాంగ పరిషత్తులో భారతీయులే భారత రాజ్యాంగాన్ని నిర్మించాలని నొక్కి వక్కానించారు. 1940లో, ఆనాటి వైస్రాయి లిన్‌విత్‌గ్రో భారతీయులు తమ రాజ్యాంగాన్ని (డ్రాఫ్టు) రూపొందించుకోవచ్చునని ఆమోదించారు.

బ్రిటిష్ పాలనలో దేశంలో అయిదు వందలకు పైగా, సంస్థానాలు, చిన్నచిన్న రాజ్యాలు, బ్రిటిష్ గవర్నర్లు పాలించే పదకొండు పరగణాలు (ప్రావిన్సెస్) ఉండేవి. బ్రిటిష్ రాజ ప్రతినిధులు ప్రావిన్సెస్ పాలనాధికారులుగా ఉండేవారు. 1905 నుండి బ్రిటిష్ ప్రభుత్వం స్వరాజ్యం కోసం భారతీయులు చేస్తున్న పోరాటాన్ని గమనించి, రాజ్యపాలనలో వారికి కొంత ప్రాధాన్యత ఇస్తున్నట్లుగా లెజిస్లేటివ్ కౌన్సిల్సు ఏర్పరిచి (మింటో–మార్లే సంస్కరణలు) అందులో ప్రముఖులైన భారతీయుల్ని సభ్యులుగా నామినేట్ చేసింది. 1935లో బ్రిటిష్ రాజ ప్రతినిధులు భారతీయులకు పరిమితమైన హక్కులు ఇవ్వాలని నిశ్చయించుకొని బ్రిటిష్ ప్రభుత్వ పరిపాలనలో ఉన్న 11 పరగణాలలో (ప్రావిన్సెస్) భారతీయులకు లెజిస్లేటివ్ కౌన్సిలుకు సభ్యుల్ని ఎన్నుకొనే వెసులుబాటు కల్పించింది. 1935 ఎన్నికల సమయానికి లెజిస్లేటివ్ కౌన్సిలుకు నామినేట్ చేయబడిన మహిళలున్నారు.

1946లో బ్రిటిషు ప్రభుత్వం “కేబినెట్ మిషన్ ప్లాను” ద్వారా ఇండియాకు రాజ్యాంగాన్ని రూపొందించాలని నిశ్చయించింది. సర్ స్టాఫర్డ్ క్రిప్స్ నాయకత్వంలో ముగ్గురు బ్రిటిషు అధికారులకు విశేష అధికారమిచ్చి ఇండియాకు ‘కేబినెట్ మిషన్ ప్లాను’ పేరిట పంపించారు. కేబినెట్ మిషన్ ప్లాను ఆదేశాల మేరకు రాజ్యాంగ పరిషత్తు (కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ) ఏర్పరిచినపుడు, ప్రొవెన్షియల్ ఎన్నికలలో ఎన్నుకోబడిన సభ్యులు పరోక్ష పద్ధతిలో రాజ్యాంగ పరిషత్తు సభ్యుల్ని ఎంపిక చేయాలని సూచించింది. ఆ విధంగా ప్రొవెన్షియల్ లెజిస్లేటివ్ అసెంబ్లీనుండి 292, సంస్థానాల నుండి 93, చీఫ్ కమిషనర్ ప్రావిన్సెస్ అయిన ఢిల్లీ అజ్మీర్, కూర్గు, బ్రిటిష్, బెలూచిస్థాన్‌ల నుండి నలుగురు సభ్యులు నామినేట్ చేయబడ్డారు. 16 మే 1946లో కేబినెట్ మిషన్ ప్లాన్ ఆధ్వర్యంలో తయారుచేసిన రాజ్యాంగ డ్రాఫ్టును ఆచరణలో పెట్టారు. ఆగష్టు 1946లో బ్రిటిష్ –

ఇండియా ప్రావిన్సెస్ 296 సీట్లకు ఎన్నికలు జరిగాయి – కాంగ్రెసుకు 208 సీట్లు, ముస్లిం లీగ్‌కు 93 సీట్లు లభించాయి. రాజ్యాంగ పరిషత్తులో కాంగ్రెస్ ఆధిపత్యం ఎక్కువగా ఉంటుందని ముస్లిం లీగ్ నాయకులకు జిన్నా లెజిస్లేచర్లలో ముస్లిమ్‌లకు సమాన హక్కులు గ్యారంటీ ఇవ్వమన్నాడు. నేషనల్ ఇండియన్ కాంగ్రెస్ సభ్యులు, అసెంబ్లీలో మెజారిటీ ప్రకారం చేయాలని అనడంతో ముస్లిమ్ లీగ్ ప్రత్యేక దేశం ప్రత్యేక రాజ్యాంగ పరిషత్తు కావాలని డిమాండ్‌చేసింది. 3 జూన్ 1947 వైస్రాయ్‌లార్డ్ మౌంట్ బాటన్ 'కేబినెట్ మిషన్ ప్లాను' రద్దు చేసినట్లు ప్రకటించారు. 18 జూలై 1947 ఇండియన్ ఇండిపెండెంట్ యాక్ట్ అమలుపరచడం వలన దేశ విభజన అనివార్యమయింది. ఇండియా, పాకిస్థాన్‌లు రెండు దేశాలుగా విడిపోయాయి. తొలుత 18 జూన్ 1948 నాటికి ఇండియాకు స్వాతంత్ర్యం ఇస్తామన్న బ్రిటిష్ ప్రభుత్వం ఆకస్మికంగా ఆగష్టు 1947లో ఇండియాను స్వతంత్ర దేశంగా ప్రకటించింది. రాజ్యాంగ ప్రతి (డ్రాఫ్టు) రూపొందించడానికి ఏర్పడిన రాజ్యాంగ పరిషత్తు (కాన్‌స్టిట్యూషన్ అసెంబ్లీ) ఎనిమిది ముఖ్యమైన కమిటీలను నియమించింది.

1) కాన్‌స్టిట్యూషన్ మేకింగ్ యూనియన్ పవర్స్ కమిటి.
2) యూనియన్ కాన్‌స్టిట్యూషన్ కమిటి
3) ప్రొవెన్షియల్ కాన్‌స్టిట్యూషన్ కమిటి
4) డ్రాఫ్టింగ్ కమిటి
5) ప్రాథమిక హక్కులు, మైనారిటీల అడ్వైజరీ కమిటి.
6) రూల్స్ ఆఫ్ ప్రొసిజర్ కమిటి
7) స్టేట్స్ కమిటి
8) జవహర్‌లాల్ స్టీరింగు కమిటి

మొదటిసారిగా, డా॥ బి.ఎన్. రావు (బెనిగళ్ళ నరసింగరావు) ప్రాథమిక (బేసిక్) రాజ్యాంగ డ్రాఫ్టుని తయారుచేశారు. తర్వాత ఆయన అంతర్జాతీయ న్యాయస్థానంలో సభ్యుడిగా ఎంపిక చేయబడి వెళ్ళిపోయారు. డ్రాఫ్టింగ్ కమిటీలో ఏడుగురు సభ్యులున్నారు. (1) అల్లాడి కృష్ణస్వామి అయ్యర్; (2) ఎన్. గోపాలస్వామి; (3) బి.ఆర్. అంబేద్కర్; (4) కె.యమ్. మున్షీ; (5) మహమ్మద్ సాదుల్లా; (6) బి.ఎల్. మిట్టర్; (7) డి.పి. ఖైతాన్. ఈ డ్రాఫ్టింగ్ కమిటి ఎందుచేతనంటే రాజ్యాంగ పరిషత్తులో జరిగిన చర్చలు, వాదోపవాదాలు అన్నింటిని సమీకరించి, సమీక్షించి, మార్పులు, చేర్పులు కూర్చి వరుస క్రమంలో వ్రాయాలి. ఈ గురుతర బాధ్యత చేపట్టడానికి డా॥ బి.ఆర్. అంబేద్కర్‌ను ఎన్నుకొన్నారు. 29 ఆగష్టు 1947 నాడు రాజ్యాంగ పరిషత్తు (కాన్‌స్టిట్యూషనల్ అసెంబ్లీ) డా॥ బి.ఆర్. అంబేద్కర్ నాయకత్వంలో డ్రాఫ్టింగ్ కమిటీని ఏర్పరచింది.

డ్రాఫ్టింగ్ కమిటీలో మహిళలు లేకపోయినా, రాజ్యాంగ పరిషత్తుకు ఎంపిక అయిన పదిహేనుమంది మహిళలు భారత రాజ్యాంగాన్ని ఇతర దేశాల రాజ్యాంగాలను క్షుణ్ణంగా పరిశీలించి, దేశ సామాజిక, ఆర్థిక, రాజకీయ పరిస్థితుల దృష్ట్యా సరైన సవరణలు సూచించారు. రాజ్యాంగ నిర్మాణం (ఫైనల్ డ్రాఫ్టు) గురించి 165 రోజులు సుదీర్ఘమైన చర్చలు జరిగాయి. ఇంచుమించు మూడేళ్ళ మేథోమథనం తర్వాత డ్రాఫ్టు పూర్తి అయింది. (రెండు సంవత్సరాలు, పదకొండు నెలలు, ఏడురోజులు రాజ్యాంగ పరిషత్తు సభ్యులు మొదటిసారిగా ఢిల్లీలో 9 డిసెంబరు 1946 నాడు కాన్స్టిట్యూషన్ హాలు (ఇప్పుడు పార్లమెంటు సెంట్రల్ హాలు) లో సమావేశమయ్యారు. 26 నవంబరు 1949 నాటికి చర్చలు ముగిసి రాజ్యాంగ బిల్లు ఆమోదించబడింది. 26 నవంబరు తేదీన భారత రాజ్యాంగ దినం లేదా సంవిధాన్ దివస్‌గా ఉత్సవం జరుపుకొంటారు. రాజ్యాంగ పరిషత్తు ఆమోదించిన, రాజ్యాంగ బిల్లు 26 జనవరి 1950లో అమలులోకి వచ్చింది. అందుచేతనే 26 జనవరి గణతంత్ర దినం (రిపబ్లిక్ డే)గా భారత ప్రజలు జరుపుకొంటారు.

ప్రపంచంలో అతి సుదీర్ఘమైన లిఖిత రాజ్యాంగ చట్టం భారత రాజ్యాంగం. రాజ్యాంగ డ్రాఫ్టుని టైపు చేయకుండా అందమైన వ్రాతలిపి (కేలీగ్రఫీ) హిందీలో, ఇంగ్లీషులో కేలిగ్రాఫర్ ప్రేమ్ బిహారి నారాయణ్ రైజాద రాశారు. రాజ్యాంగ ప్రతులను భద్రంగా హీలియం నింపిన పేటికలలో పార్లమెంటు లైబ్రరీలో ఉంచారు. చక్కని చిత్రాలతో రాజ్యాంగ ప్రతిని ఆకర్షణీయంగా తీర్చిదిద్దారు, శాంతి నికేతన్ ఆచార్యులు సుప్రసిద్ధ చిత్రకారులు నందలాల్‌బోసు, వారి శిష్యబృందం.

2014లో ప్రఖ్యాత సినీ దర్శకుడు శ్యామ్ బెనిగళ్, సంవిధాన్ అనే పేరుతో 'భారత రాజ్యాంగ నిర్మాణ కథనం' పది ఎపిసోడ్‌ల టి.వి. సీరియల్‌గా రాజ్యసభ టి.వి. వారి ఆధ్వర్యంలో చేశారు. పార్లమెంటు భవనంలోనే నిర్మించిన ఈ చిత్రం నాటి రాజ్యాంగ పరిషత్తులో జరిగిన చర్చలు మనకు కళ్ళకు కట్టినట్లుగా చిత్రించి చూపించారు శ్యామ్ బెనిగళ్. 'ఇది అంత తేలికైన పనికాదు, 'సంవిధాన్ కేవలం ఈ తరంవారి కోసమే కాదు అంటారాయన. భావితరాలు గర్వించేలా రూపొందించిన 'సంవిధాన్' భారతీయులంతా చూసి తీరాలి. ఈ ఎపిసోడ్లను యూ-ట్యూబ్‌లో చూడవచ్చును. పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ ఉపాధ్యాయులు విద్యార్థుల్ని 'సంవిధాన్' చూడమని ప్రోత్సహిస్తే ఈనాటి విద్యార్థులకు ఎంతో మేలుచేసేవారవుతారు. 'కాన్స్టిట్యూషన్ డిబేట్స్'ను కూడా డౌన్లోడ్ చేసుకొని చదవవచ్చును. ఎంతోమంది ప్రయివేటు టి.వి. ఛానల్స్‌వారు శ్యామ్ బెనిగళ్‌ను 'సంవిధాన్' సీరియల్‌పై హక్కులు ఇమ్మని అడిగారట. 'రాజ్యసభ కోసం చేసిన ఈ సీరియల్ పార్లమెంటు ఉభయ సభల టివిల ద్వారా చూపించాలి. దేశ రాజకీయ భవిష్యత్తు అంతా పార్లమెంటు మీద ఆధారపడి ఉంటుంది' అంటారాయన.

రాజ్యాంగ చట్టం రూపొందిస్తున్న సమయంలో అంతవరకు కలిసి స్వాతంత్ర్యం కోసం సమైక్యంగా పోరాడుతున్న భారతజాతి మత ప్రాతిపదికపై రెండు దేశాలుగా విభజించబడింది. భారత, ప్రాక్పశ్చిమ పాకిస్తాన్ సరిహద్దులలో హింస చెలరేగి ప్రజల రక్తం ఏరులై ప్రవహించింది. రాజ్యాంగ పరిషత్తును కూడా తిరిగి ఏర్పరచవలసి వచ్చింది. ముస్లింలీగ్ సభ్యులలో అధిక శాతం పాకిస్తానుకు వెళ్ళిపోయారు. 30 జనవరి 1948 జాతిపిత దారుణహత్యకు గురయ్యారు. అనూహ్యమైన విషాదం దేశాన్ని కుదిపివేసింది. రాజ్యాంగ నిర్మాణ చర్చలలో మునిగివున్న దేశనాయకులంతా దిగ్భ్రాంతికి గురయ్యారు. దిక్కుతోచని స్థితి నుండి తేరుకొని రాజ్యాంగాన్ని బాధ్యతాయుతంగా నిర్మించడంలో నిమగ్నులయ్యారు. స్వాతంత్ర్య పోరాటంలో స్త్రీలు భాగస్వాములు కావాలని, ఓర్పు, సహనం గల స్త్రీజాతి ఇంటిని తీర్చిదిద్దినట్లే దేశాభ్యుదయానికి పాటుపడగలరనే గాంధీజీ ఆశయం, విశ్వాసాలను ధృవీకరిస్తూ రాజ్యాంగ పరిషత్తుకు నామినేట్ చేయబడిన పదిహేనుమంది మహిళలు తమ శక్తి సామర్థ్యాలను నిరూపించుకొన్నారు. వీరందరిపై గాంధీజీ ప్రభావం గాఢంగా ఉంది. ఇంగ్లాండులో చదివి వచ్చిన రాజకుమారి అమృత్‌కౌర్, గాంధీజీ ఆశ్రమానికి వెళ్ళాలని నిశ్చయించుకొన్నది. 1930లో ఆమె తండ్రి మరణించిన తరువాత గాంధీజీ సెక్రటరీగా పదహారేళ్ళు పనిచేశారు. కేరళా లెజిస్లేచర్ నుండి రాజ్యాంగ పరిషత్తుకు నామినేట్ చేయబడిన ఏకైక దళిత మహిళ దాక్షాయణి గాంధీజీ ఆశ్రమంలో కస్తూర్బా, గాంధీజీల ఆశీస్సులతో వేలాయుధన్‌ను వివాహం చేసుకొన్నది. సరోజినీనాయుడు గాంధీజీతోపాటు జైలుశిక్ష అనుభవించి, రౌండుటేబుల్ సమావేశానికి గాంధీజీతో లండన్‌కు వెళ్ళారు. పన్నెండేళ్ళ వయసులో కాంగ్రెస్ కార్యకర్తగా పనిచేసిన దుర్గాబాయ్, గాంధీజీ తెలుగు రాష్ట్రం పర్యటించినపుడు హిందీలో ఆయన ఉపన్యాసాలను సునాయాసంగా తెలుగులో అనువదించి ప్రశంసలందుకొన్నది. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ కార్యకర్తలు మాలతీచౌదరి ఆమె భర్త నభకృష్ణచౌదరి గాంధీజీ ఒరిస్సాలో పాదయాత్ర చేసినపుడు గాంధీజీని అనుసరించారు. అమ్ముస్వామినాథన్ ఆమె భర్త కాంగ్రెస్‌లో చేరి గాంధీజీ అనుయాయులయ్యారు. పూర్ణిమా బెనర్జీ, లీలారాయ్, రేణుకారే, విజయలక్ష్మి పండిట్, ఆనీమాస్ కర్నీ, సుచేతా కృపలానీ, స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని గాంధీజీ ఆశయాలకు అంకితమయ్యారు. ఇంగ్లాండులో చదివిన హంసామెహతా (బరోడాదివాన్‌గారి కుమార్తె) గాంధీజీకి డాక్టరుగా ఉన్న జీవరాజ్ మెహతాను వర్ణాంతర వివాహం చేసుకొని స్వాతంత్ర్య పోరాటంలో జైలుకెళ్ళారు. రాజ్యాంగ పరిషత్తులో క్రియాశీలక పాత్ర పోషించిన వీరిని గురించి రేఖామాత్రంగా స్పృశించి తదుపరి ఒక్కొక్కరు ఏ విధంగా రాజ్యాంగ పరిషత్తు చర్చలలో పాల్గొని, సవరణలు ప్రతిపాదించి, స్వాతంత్ర్యం తరువాత దేశాభివృద్ధికి ఎలా కృషి చేశారో పరిశీలిద్దాం.

అమ్ముస్వామినాథన్ పాల్ఘాట్ జిల్లాలో నాయర్ కుటుంబంలో జన్మించారు. 1917 మద్రాసులో ఆమె "వుమెన్స్ ఇండియా అసోసియేషన్' అనే స్త్రీల సంస్థను, అనిబిసెంట్, మార్గరెట్ కజిన్స్, మాలతి పట్వర్ధన్, శ్రీమతి దాదాభాయ్, శ్రీమతి అంబుజమ్మాళ్‌లతో కలిసి స్థాపించారు. క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళారు. 24 నవంబరు 1949లో అంబేద్కర్ కాన్‌స్టిట్యూషన్ డ్రాఫ్టు ఆమోదం గురించి సభను ఏర్పాటు చేసినపుడు ఆమె ఇలా అన్నారు. "ఇతర దేశప్రజలు ఇండియాలో స్త్రీలకు సమాన హక్కులు లేవంటారు. భారతీయులు తమ రాజ్యాంగ చట్టం తయారు చేసుకొన్నపుడు స్త్రీలకు భారతదేశ పౌరులందరి వలె సమాన హక్కులు ఉన్నాయని ఇప్పుడు మనం చెప్పగలం." అన్నారు. 1946లో ఆమె మద్రాసు కాన్‌స్టిట్యూన్సీ నుండి రాజ్యాంగ పరిషత్తుకు ఎంపిక అయ్యారు.

ఆనీ మాసకర్నీ తిరువనంతపురంలో లాటిన్ కేథలిక్ కుటుంబంలో జన్మించారు. ట్రావెన్‌కోర్ స్టేట్ కాంగ్రెస్‌లో ప్రవేశించిన మొదటి మహిళ. ఎన్నోసార్లు స్వాతంత్ర్యోద్యమంలో అరెస్టు చేయబడ్డారు. రాజ్యాంగ నిర్మాణంపై జరిగిన చర్చలలో ఆమె కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల అధికారంలో సమతుల్యం ఉండాలని వాదించారు. ప్రజాస్వామ్య ప్రభుత్వాన్ని నెలకొల్పుతున్నప్పుడు రాజ్యాంగంలో సవరణలు రాబోయే ఎన్నికలలో గెలుపుకోసం చేయకూడదు. దేశంలో భావితరాల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకొని చేయాలి, అన్నారు. స్వతంత్ర భారతదేశంలో ఆమె కేరళ నుండి ప్రథమ మహిళా పార్లమెంటేరియన్.

రాజ్యాంగ పరిషత్తులో ఏకైక ముస్లిమ్ వనిత, బేగమ్ కుద్సియా అయిజాజ్ రసూల్. యునైటెడ్ ప్రావిన్సెస్ నుండి ఎంపిక అయ్యారు. రాజ్యాంగ నిర్మాణం గురించి ఆమె ఇచ్చిన ఉపన్యాసాలలో న్యాయశాస్త్రంలో ఆమెకున్న లోతైన అవగాహన, మిగతా దేశాల రాజ్యాంగాల గురించి ఆమెకున్న పరిజ్ఞానం విశదమవుతుంది. మైనారిటీలకు ప్రత్యేక నియోజకవర్గాలు, ముస్లింలకు రిజర్వేషన్లు అఖ్ఖర్లేదని ఆమె ఉద్ఘాటించారు. దేశభాషగా హిందీని అమలు చేయాలన్న ప్రతిపాదనను సవరిస్తూ, హిందీ భాష రాని మిగతా రాష్ట్ర ప్రజలకు తగినంత సమయం హిందీ భాష నేర్చుకోవడం కోసం ఇవ్వాలన్నారు. రాజ్యాంగంలో ఎన్నో లోటుపాట్లు ఎత్తి చూపించి, ఆమె తగిన సవరణలు (ఎమెండ్‌మెంట్స్) సూచించారు.

ద్రాక్షాయణి వేలాయుధన్ 1946లో మొదటిసారిగా కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీకి ఎన్నుకోబడిన దళిత స్త్రీ. కేరళలో అంటరానివారిగా వెలివేయబడిన పులయ జాతికి చెందిన దేశంలోనే ఆమె ప్రథమ దళిత మహిళా పట్టభద్రురాలు. పులయజాతిలో శరీర

పైభాగంపై వస్త్రం ధరించిన మొట్టమొదటి వనిత. ఎన్నో వివక్షతలకు గురి అయినా, ఆమె ఏనాడూ తాను అణచివేయబడలేదని ఆత్మవిశ్వాసంతో ముందడుగు వేశారు. షెడ్యూలు జాతివారికోసం ఆమె డా॥ అంబేద్కర్‌తో ఎన్నో విషయాలు చర్చించారు. సమాజంలో హీనంగా చూడబడేవారికి కావల్సినది ప్రత్యేక రిజర్వేషన్లు కావు, నైతిక భద్రత అన్నారామె. అస్పృశ్యతను నేరంగా పరిగణించాలని వెట్టిచాకిరీ, బానిసత్వం రూపుమాపాలని ఆమె ఉద్బోధించారు. స్వాతంత్ర్య భారతావనిలో అందరు పౌరులకు ఒకే విధమైన జాతీయ గుర్తింపు ఉండాలన్నారు. ఆమె రిజర్వేషన్లకు వ్యతిరేకి. దుర్గాబాయ్ పేరుకు తగినట్లుగా స్త్రీశక్తికి ప్రతీక. 1909లో ఆంధ్రదేశంలో జన్మించింది. పన్నెండేళ్ళ వయసులో కాంగ్రెస్ కార్యకర్తగా చేరి సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని అనేకసార్లు జైలుకు వెళ్ళారు. అతి పిన్న వయసులో ఆమెకు వివాహం జరిగింది. రాజ్యాంగ చట్టంలో బాల్య వివాహాలు నేరమని, చట్ట విరుద్ధమని ప్రకటించమని కోరారు. ఆమె దృక్పథం కేవలం న్యాయశాస్త్రానికి పరిమితం కాలేదు. పిల్లల్ని, స్త్రీలను బానిసలుగా విక్రయించడం అరికట్టాలన్నారు. గాంధీజీ ఆశయం మేరకు స్వాతంత్ర్యానికి రెండు దశాబ్దాల ముందే ఆమె హిందీ ప్రచారానికి పూనుకొన్నారు. రాజ్యాంగ పరిషత్తులో హిందీభాషను దేశభాషగా అమలు చేయడంలోని సాధకబాధకాలు ఆమె వివరించారు. సామాజిక రుగ్మతలు అధిగమించడానికి స్త్రీలకు విద్య అవసరమని, ఆమె 1936లో మద్రాసులో ఆంధ్ర మహిళా సభ స్థాపించారు. పదేళ్ళల్లో ఈ సంస్థ విద్యా, సాంఘిక, సంక్షేమ కేంద్రంగా భాసించింది. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఆమె ఎన్నో సంక్షేమ సంస్థలకు అధ్యక్షురాలిగా ఉన్నారు.

సామాజిక సేవాకర్తా విద్యావేత్త హంసామెహతా బరోడా దివాన్ మనూభాయ్ నందశంకర్ మెహతా కుమార్తె. ఆమె ఇంగ్లాండులో జర్నలిజం, సోషియాలజీ అధ్యయనం చేశారు. ఆమె పిల్లలకోసం ఇంగ్లీషు పుస్తకాలను గుజరాతీ భాషలోకి అనువదించారు. కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ పూనుకొన్న రాజ్యాంగ నిర్మాణం గురించి ఎంతోమంది విమర్శిస్తే ఆమె ఇలా అన్నారు. “మనకున్న పరిస్థితులలో ఇంతకంటె గొప్ప రాజ్యాంగచట్టం తయారు చేయలేము. అసెంబ్లీలో విభిన్న దృక్పథాలు, అభిప్రాయాలు ఉన్నాయి, అయినప్పటికీ ఈ విధంగా ఒక నిర్ణయానికి రాగలగడం ఒక అద్భుతం.” మైనారిటీ వర్గాల రిజర్వేషన్లు ఆమె కూడా వ్యతిరేకించారు. ఒక్క షెడ్యూలు కులానికి తప్ప మిగిలిన వారికి అవసరం లేదన్నారు. “దళితులు ఎన్నో తరాలుగా హిందూ సమాజంలో వివక్షతకు గురి అయ్యి చాలా వేదన అనుభవించారు. వాళ్ళు పడిన అవస్థలకు మనం చేయగలిగేది వారికి ప్రత్యేక అవకాశాలు ఇచ్చి అస్పృశ్యతను పూర్తిగా నిర్మూలించాలి. అటువంటి మంచిపని మనం చేయగలిగితే మన భావితరాలు సంతోషిస్తాయి.” మద్యపాన నిషేధాన్ని

ఆమె బలపరిచారు. ప్రభుత్వానికి మద్యపాన అమ్మకం ద్వారా ఆదాయం వస్తుంది అనుకొంటే అటువంటి పాపిష్టి డబ్బు మనకు అవసరమా? అనడిగారామె.

కమలాచౌదరి లక్నోలో సంపన్న కుటుంబంలో జన్మించారు. కుటుంబ సభ్యులంతా బ్రిటిషు ప్రభుత్వానికి విధేయులుగా ఉంటే, ఈమె మాత్రం జాతీయోద్యమంలో చేరి 1930లో గాంధీజీ పిలుపు మేరకు సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. ఎన్నోసార్లు బ్రిటిషు ప్రభుత్వం ఆమెను నిర్బంధించి జైలులో పెట్టారు. ఆలిండియా కాంగ్రెస్ కమిటీ 54వ సభకు ఆమె వైస్ ప్రెసిడెంట్‌గా ఉన్నారు. ఆమె ఉత్తరప్రదేశ్ స్టేట్ సోషల్ వెల్ఫేర్ అడ్వయిజరీ బోర్డు మెంబరుగా ఉన్నారు. ఆమె నాలుగు కథల సంపుటాలు వెలువరించారు. ఆమె కథలు స్త్రీల అంతరంగాన్ని ప్రతిబింబిస్తాయి.

లీలారాయ్ బెంగాలు నుండి రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నికైన ఏకైక మహిళ. రాడికల్ లెఫ్టిస్ట్ గ్రూపుకు చెందిన లీలారాయ్, నేతాజీ సుభాష్ చంద్రబోసుకు అనుయాయి. ఢాకా యూనివర్శిటీలో చేరి చదివిన ఏకైక పోష్టు గ్రాడ్యుయేట్ విద్యార్థిని. విద్య పూర్తి అయ్యాక ఆమె సంఘ సేవకు పూనుకొన్నారు. సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నప్పుడు ఆమెను ఆరేళ్ళపాటు జైలులో నిర్బంధించారు. బాలికలవిద్య గురించి ఆమె ఎక్కువ కృషి చేశారు. వృత్తి విద్యలతోపాటు ఆడపిల్లలు తమ రక్షణ కోసం యుద్ధ విద్యలు నేర్చుకోవాలని ఆమె ఆకాంక్షించారు. స్వాతంత్ర్యం కోసం పోరాడడంలో స్త్రీలు వారికి నచ్చిన విధానాన్ని ఎన్నుకోవచ్చును అన్నారామె. 1923లో ఆమె మిత్రులతో కలిసి "దిపాలీ సంఘ' అనే సంస్థను స్థాపించి ఎన్నో పాఠశాలలు పెట్టారు. ప్రముఖ నేతలతో పాఠశాలలో రాజకీయ చర్చలు జరిగేవి. 1926లో ఆమె, కలకత్తా, ఢాకా విద్యార్థినులతో 'ఛత్రీసంఘ' స్థాపించారు. ఉప్పు సత్యాగ్రహంలో ఆమె ప్రారంభించిన, 'ఢాకా మహిళా సత్యాగ్రహ సంఘ' ప్రధాన పాత్ర వహించింది. 1937లో ఆమె బెంగాల్ ప్రొవెన్షియల్ కాంగ్రెస్ ఉమెన్స్ ఆర్గనైజేషన్ స్థాపించారు. తెలంగాణాలో ఆమె నిర్విరామ కృషితో పనిచేస్తూ యువతను స్వాతంత్ర్యం కోసం పోరాడే యోధులుగా మలిచింది. రాజ్యాంగ పరిషత్తులో చర్చలు జరుగుతున్నప్పుడు, దేశ విభజన వలన నౌఖాలీలో హింస చెలరేగింది. అందుచేత రాజ్యాంగ పరిషత్తు నుండి నౌఖాలీ వచ్చి ఆమె నేషనల్ సర్వీస్ ఆర్గనైజేషన్ ద్వారా సహాయ శిబిరాలు నెలకొల్పి ఎంతోమంది నిరాశ్రయులైన స్త్రీలకు రక్షణ కల్పించింది. 'జయశ్రీ' అనే పత్రికను స్త్రీలకు రాజకీయ చైతన్యం కలిగించడానికి స్థాపించింది.

మాలతీ చౌదరి తూర్పు బెంగాల్ (బంగ్లాదేశ్) కులీన వంశంలో జన్మించింది. 1921లో పదహారేళ్ళ ప్రాయంలో మాలతీ చౌదరిని శాంతినికేతన్‌లో విద్య నభ్యసించడానికి

పంపారు. ఉప్పు సత్యాగ్రహం సమయంలో ఆమె తన భర్త నభకృష్ణచౌదరితోపాటు ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌లో చేరి ఉద్యమంలో పాల్గొన్నారు. 1934లో ఒరిస్సాలో గాంధీజీతోపాటు పాదయాత్రలో పాల్గొన్నారు. గాంధీజీ ఆమెను 'తుఫానీ' అని పిలిచేవారట. ఆమె ఎక్కువగా గిరిజన సంక్షేమం కోసం పాటు పడేవారు. రాజ్యాంగ పరిషత్తులో నెహ్రూ, పటేల్, అంబేద్కర్ దుర్గాబాయ్ వంటి దిగ్గజాల మధ్య ఇమడలేనని ఆమెకు అన్పించింది.

పూర్ణిమా బెనర్జీ బ్రిటిష్ ప్రభుత్వ ఆధిపత్యాన్ని ధిక్కరించిన ధీరవనిత. సత్యాగ్రహాల్లోనూ, క్విట్ ఇండియా ఉద్యమంలో పాల్గొన్నందుకు ఆమెను ఎన్నోసార్లు అరెస్టు చేసి జైల్లో ఉంచారు. ఆమె ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ కమిటి, (అలహాబాద్) సెక్రటరీగా పనిచేశారు. రాజ్యాంగ పరిషత్తులో ఆమె ఇచ్చిన ఉపన్యాసాలలో ముఖ్యమైన సామాజిక సిద్ధాంతాలు. వాటిపై ఆమెకున్న విశ్వాసం ప్రగాఢమైనది. పట్టణ సెక్రటరీగా ఆమె ట్రేడ్ యూనియన్ కిసాన్ సమ్మేళనం, తదితర గ్రామీణ కార్యక్రమాలు నిర్వహించడంలో బాధ్యత తీసుకొన్నారు. ఎయిడెడ్ స్కూళ్ళల్లో, గవర్నమెంటు స్కూళ్ళల్లోగాని కుల, మత వివక్షతలు ఉండరాదనే భావాన్ని ఆమె బలపరిచారు. రాజకీయ ఖైదీలుగా ఉ ండడంచేత, నిర్భంధంలో ఉండి ఎలా కష్టాలు పడ్డామో మాకు అర్థం అయింది. అందుచేత, ఎవరైనా అరెస్టు చేయబడితే, మేజిస్ట్రేటు ముందు నిలబెట్టినపుడు ఎందుకు అరెస్టు చేశారో, వారిమీద ఏ ఆరోపణలు ఉన్నాయో తెలియజేయాలి అని ఆమె అన్నారు. ఆమె కూడా స్త్రీలకు ప్రత్యేక రిజర్వేషన్లు అఖ్ఖర్లేదని అన్నారు. బ్రిటిషు ప్రభుత్వం ఉప్పుమీద పన్ను వేసేవారు. అందుచేత రాజ్యాంగ చట్టంలో ఉప్పు తయారుచేసే భారతదేశంలో ఉప్పుమీద పన్ను వేయకూడదని ఆమె మరి కొంతమందితో కలిసి తీర్మానించారు.

ఆ రోజుల్లో మత సంబంధిత విషయాలను ఎక్కువగా బోధించే వాతావరణం విద్యాలయాల్లో ఉండేది. మత సంబంధిత విషయాల బోధన గురించి విద్యాలయాలపై ప్రభుత్వ కంట్రోల్ ఉండాలని ఆమె సూచించారు. వారి ఇష్టానికి వ్యతిరేకంగా మత సంబంధమైన క్లాసులకి హాజరు కావాలని విద్యార్థుల్ని నిర్భంధించకూడదని ఆమె నొక్కి వక్కాణించారు. ఉత్తరప్రదేశ్‌లో రాడికల్ వుమెన్ గ్రూపుకు చెందిన పూర్ణిమ 1930–40ల మధ్య స్వాతంత్ర్య పోరాటంలో చురుకుగా పాల్గొన్నారు.

రాజకుమారి అమృత్‌కౌర్ కపుర్తాలా మహారాజు హర్‌నామ్‌సింగ్ కుమార్తె. ఇంగ్లాండులో చదువు పూర్తి చేసుకొని వచ్చి స్వాతంత్రోద్యమంలో పాల్గొన్నది.

దండియాత్రలో పాల్గొన్నందుకు ఆమెను అరెస్టుచేసి జైల్లో పెట్టారు. 1927లో ఆమె "ఆలిండియా వుమెన్స్ కాన్ఫరెన్స్" అనే సంస్థను ప్రారంభించారు. 1934 నుండి పదహారేళ్ళపాటు ఆమె గాంధీజీ సెక్రటరీలలో ఒకరుగా ఉన్నారు. సెంట్రల్ ప్రావిన్స్ నుండి రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నుకోబడ్డారు. రెండు ముఖ్యమైన సబ్ కమిటీలలో ఆమె సభ్యురాలు. రాజ్యాంగ చట్టంలో యూనిఫామ్ సివిల్‌కోడ్ అమలు పరచాలని ఆమె వాదించారు. యూనిఫామ్ సివిల్‌కోడ్ ఉంటేనే సమాజంలో ముఖ్యంగా స్త్రీలు అసమానతలకు గురి అవ్వరని ఆమె భావించారు. బాల్యవివాహాలు, పరదాపద్ధతి, దేవదాసి వ్యవస్థ మొదలైన వాటిని సామాజిక రుగ్మతలుగా గుర్తించి వాటిని పూర్తిగా రూపుమాపడానికి కృషి చేశారు. స్త్రీకి విద్య అవసరమని, స్త్రీలు క్రీడారంగంలో ఉండాలని, ఆరోగ్యం గురించి శ్రద్ధ వహించాలని ఆమె అభిలషించారు. ఆమె ఆలిండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్ (ఎఐఐఎమ్ఎస్) స్థాపించారు. ఆమె నెహ్రూ కేబినెట్‌లో ప్రథమ మహిళామంత్రిగా ఆరోగ్య శాఖను సమర్ధవంతంగా నిర్వహించారు. ట్యూబర్క్యులోసిస్ అసోసియేషన్ ఆఫ్ ఇండియా, ది సెంట్రల్ లెప్రసీ అండ్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లను స్థాపించారు.

రేణుకా రే తండ్రి సతీష్ ముఖర్జీ ఇండియన్ సివిల్ సర్వీస్ ఆఫీసరు. తల్లి చారులత ముఖర్జీ సోషల్ వర్కర్. రేణుక లండన్ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్‌లో బి.ఏ. చేసి వచ్చింది. 1934లో ఆమె ఆలిండియా వుమెన్స్ కాన్ఫరెన్స్ (ఎఐడబ్ల్యుసి) ప్రెసిడెంట్. రాజ్యాంగ పరిషత్తులో సభ్యురాలయ్యేముందు సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ నుండి మహిళా ప్రతినిధిగా నామినేట్ చేయబడింది. ఆమె కూడా రిజర్వేషన్లకు వ్యతిరేకి. స్త్రీలందరికీ సమానమైన పర్సనల్ కోడ్ ఉండాలని వాదించింది. 1943 నుండి 1946 వరకు సెంట్రల్ లెజిస్లేటివ్ అసెంబ్లీ, కాన్‌స్టిట్యూషన్ అసెంబ్లీ, ప్రొవిషనల్ పార్లమెంటులలో సభ్యురాలు. ఆలిండియా వుమెన్స్ కాన్ఫరెన్స్ ప్రెసిడెంటుగా ఆమె స్త్రీల హక్కులు, స్త్రీలకు తల్లిదండ్రులపై హక్కుల గురించి పోరాడారు. 1952-57లో ఆమె వెస్ట్‌బెంగాల్ లెజిస్లేటివ్ అసెంబ్లీలో మినిస్టర్ ఫర్ రిలీఫ్ అండ్ రిహేబిలిటేషన్‌గా సేవలందించారు.

సరోజినీ నాయుడు 1879లో హైదరాబాద్‌లో జన్మించారు. నైజామ్ స్కాలర్‌షిప్‌కు ఎంపిక అయి, ఆమె కింగ్స్ కాలేజి, లండన్‌లో చదివారు, తర్వాత కేంబ్రిడ్జి గిర్టన్ కాలేజీలో చదివారు. 1928-29లో ఇండియాకు వచ్చి బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమంలో పాల్గొనడం వలన అనేకసార్లు జైలుకి వెళ్ళారు. లండన్‌లో జరిగిన రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కు గాంధీజీతోపాటు ఆమె వెళ్ళారు. ఇండియన్ నేషనల్ కాంగ్రెస్‌కు ప్రెసిడెంట్ అయిన మొట్టమొదటి భారతీయ మహిళ. స్వాతంత్ర్యం వచ్చాక ప్రథమ మహిళా గవర్నరుగా

పనిచేశారు. రాజ్యాంగ పరిషత్తులో ప్రాథమిక హక్కుల సబ్ కమిటి, అడ్వైజరీ కమిటీ, ప్రొవెన్షియల్ కమిటీలలో సభ్యురాలు. ఆమె సాహిత్యంలో అందెవేసిన చెయ్యి. 'రాయల్ సొసైటీ ఆఫ్ లిటరేచర్'కు ఆమె ఫెలోగా ఎంపిక అయ్యారు.

సుచేతా కృపలాని హర్యానాలో అంబాలా పట్టణంలో జన్మించారు. 1942లో క్విట్ ఇండియా ఉద్యమంలో ఆమె ముందు నిలిచారు. 1940లో ఆమె కాంగ్రెస్ పార్టీ మహిళా విభాగాన్ని ప్రారంభించారు. రాజ్యాంగ పరిషత్తుకు ఎంపిక అయ్యి, 'చార్టర్ ఫర్ ఇండియన్ కాన్‌స్టిట్యూషన్ సబ్ కమిటీకి ఆమె నామినేట్ చేయబడ్డారు. ఆమె ప్రొఫెసర్ ఆఫ్ కాన్‌స్టిట్యూషన్ హిస్టరీగా పనిచేశారు. ఆమెకంటే ఇరవై ఏళ్ళు పెద్ద అయిన కృపలానీని 1936లో వివాహం చేసుకొన్నారు. గాంధీజీతో పాటు నౌఖాలీ వెళ్ళి దేశ విభజన వలన నిరాశ్రయులైన బాధితులకు సహాయం అందజేశారు. ఆమెకున్న రాజకీయ అంకిత భావానికి ముగ్ధులై గాంధీజీ ఆమెను కస్తూర్బాగాంధీ నేషనల్ మెమోరియల్ ట్రస్టుకు 1946లో ఆర్గనైజింగ్ సెక్రటరీగా నియమించారు. ఆమె భారతదేశపు తొలి మహిళా ముఖ్యమంత్రిగా పరిపాలన దక్షతను ప్రదర్శించారు.

విజయలక్ష్మి పండిట్ మోతీలాల్ నెహ్రూ కుమార్తెగా, జవహర్‌లాల్ నెహ్రూ చెల్లెలుగా ఆమె దేశ ప్రజలకే కాదు, ప్రపంచానికే పరిచితురాలు. బ్రిటిష్ ప్రభుత్వం మూడుసార్లు ఆమెను అరెస్టుచేసి జైల్లో పెట్టారు. రాజకీయాల్లో ఆమెకు సుదీర్ఘమైన చరిత్ర ఉంది. 1936లో ఆమె అసెంబ్లీ ఆఫ్ యునైటెడ్ ప్రావిన్స్‌లో ఎంపిక అయ్యారు. 1937 లో లోక్ సెల్ఫ్ గవర్నమెంట్ అండ్ పబ్లిక్ హెల్త్‌కు కేబినెట్ మినిష్టర్‌గా ఎన్నికైన మొదటి మహిళ. 1939లో రెండవ ప్రపంచ యుద్ధంలో ఇండియా బ్రిటిష్ ప్రభుత్వం తరఫున పాల్గొనాలనే బ్రిటిష్‌రాజ్ తీర్మానాన్ని వ్యతిరేకిస్తూ కాంగ్రెస్ పార్టీ పదవులలో ఉన్నవారంతా రాజీనామా చేసినపుడు ఆమె కూడా రాజీనామా చేశారు. యు.ఎన్. జనరల్ అసెంబ్లీ ప్రెసిడెంట్‌గా నియమించబడిన ఆసియాకు చెందిన మొట్టమొదటి వనిత.

రాజ్యాంగ పరిషత్తు చర్చలలో పాల్గొన్న మహిళలు మొత్తం పదిహేనుమంది. కొన్నేళ్ళక్రితం రాజ్యసభ సెక్రటేరియట్ విపులంగా పదిమంది మహిళల ప్రసంగాలే వెలువరించింది. కనీసం మిగతా అయిదుగురు రాజకుమారి అమృత్‌కౌర్, సుచేతా కృపలానీ, కమలాచౌదరి, లీలారాయ్, మాలతి చౌదరి, పేర్లను ఉటంకించలేదు. ఈ మహిళలందరూ స్వాతంత్రోద్యమంలోను, రాజ్యాంగ నిర్మాణ సమయం తర్వాత కూడా దేశాభివృద్ధికి తమ శాయశక్తులా తోడ్పడిన దేశభక్తులు. వారి జీవితాలు భావితరాలకు స్ఫూర్తిదాయకం.

---

# 9. భారత రాజ్యాంగం కోసం ఒక పలవరింత!

– **డాక్టర్ నూకతోటి రవికుమార్,** బహుజన రచయితల వేదిక (బ.ర.వే.)
ఒంగోలు, 98481 87416

ఒక గొప్ప చరిత్రకారుడు, న్యాయవాది, తాత్వికుడు, మేధావి, ఆర్థికవేత్త, గొప్ప జాతీయ వాది, అరుదైన దేశభక్తుడు, నిరంతర ప్రజాస్వామ్యవాది, విశిష్ట పండితుడు, పాలనాదక్షుడు, మానవతావాది, లౌకిక విధానంలో ప్రగాఢ విశ్వాసం ఉన్న డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్ సమాజంలో అట్టడుగు ప్రజల హక్కులకోసం నిరంతరం తపించి పోరాడిన యోధుడు. అనేకమంది ఛాందసులతో ధర్మయుద్ధం చేసిన శాంతి సైనికుడు అయిన డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్ మరో 7 గురు సభ్యులతో కలిసి రూపొందించిన

రాజ్యాంగం అసలు అమలుకు నోచుకుంటున్నదా?

పాలనలో రాజ్యాంగం అమలవుతున్నదా?

రాజ్యాంగం నిర్దేశించిన హక్కులను రాజ్యాంగాశ్రిత శక్తులకు కల్పించటంలో అసలు రాజ్యం గుర్తించి గౌరవిస్తున్నదా?

రాష్ట్రపతులు, ఉపరాష్ట్రపతుల స్థాయిలో ఉన్నవారే అబద్దాలు, తప్పుడు వ్యాఖ్యానాలు చేస్తున్న కాలంలో మనల్ని భౌతికంగా రక్షించుకోవటం ఒకెత్తయితే, మానసికంగా మనల్ని మనం రక్షించుకోవటమే ఇవాళ మనముందు ఏర్పడిన పెద్ద చిక్కు.

వాక్ స్వాతంత్ర్యం, భావ స్వాతంత్ర్యం, సంఘంగా ఏర్పడే స్వాతంత్ర్యం, ఎక్కడికైనా స్వేచ్ఛగా వెళ్ళే స్వాతంత్ర్యం, బ్రతికే స్వేచ్ఛ, 'చట్టం ముందు అందరూ సమానమ'నే హక్కు, ఉన్నత విద్యలో, ప్రభుత్వ ఉద్యోగాలలోనూ సమాన హక్కు తదితరాలన్నీ ప్రాథమిక హక్కులుగా స్థిరపడాలని కోరుకున్నవాడు డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్.

రాజ్యాంగ నిర్మాణం కోసం వివిధ అంశాలను పరిశీలించి రాజ్యాంగం రచించటం కోసం 22 కమిటీలు, 7 ఉప కమిటీలు, 12 మైనర్ కమిటీలు వేసి మేధావులైన వారిని 12 మందికి పైగా సభ్యులను నియమించి దాదాపు మూడు సంవత్సరాలు (2 సంవత్సరాల, 11 నెలల, 18 రోజులు) కృషిచేసి పూర్తి చేసిన రాజ్యాంగం కొన్ని ముఖ్యమైన అంశాలను భారత సమాజం ముందుకు తెచ్చింది.

– ఇది సుదీర్ఘ రాజ్యాంగం, అద్భుతమైన అవతారిక, దృఢమైన సవివరమైన ప్రణాళిక

– పార్లమెంటరీ నమూనా, రాష్ట్రాల యూనియన్, అధికారాల పంపిణీ

– ప్రాథమిక హక్కులు, మానవ హక్కులు, విధులు.

– బలమైన కేంద్రం, ఏకత్వంతో కూడిన సమాఖ్య వ్యవస్థ

– వయోజన ఓటు హక్కు

– స్వతంత్ర న్యాయ వ్యవస్థ మరియు న్యాయ సమీక్ష

– సామ్యవాద, ప్రజాస్వామ్య, లౌకిక విధానం అనే కలలు కన్నది. ఆ కలలను పాలకులు ఎంతగా పెళుసుబార్చేరో చూస్తే విషాదం ముసురుపట్టిన మేఘం కమ్ముకుంటుంది.

రాజ్యాంగం అమలులోకి వచ్చి 70 ఏళ్లు దాటుతోంది. కానీ, రాజ్యాంగంలో దళితులకు కల్పించిన హక్కులు ఆచరణకు నోచుకోకపోవటం సరికదా, అంతకంతకూ కుంచించుకుపోతున్నాయి. దళితుల అభివృద్ధి కోసం, రక్షణ కోసం రాజ్యాంగంలో పొందుపర్చిన చట్టాలను పాలకులు క్రమక్రమంగా బలహీనం చేస్తూ రాజ్యాంగ స్ఫూర్తిని బాహాటంగానే తుంగలో తొక్కుతున్నారు.

దేశంలోని పౌరులందరికీ సమానంగా సామాజిక, ఆర్థిక, రాజకీయ వ్యవహారాల్లో సమానత్వం ఉండాలని, హోదాల్లో, అవకాశాల్లో అందరితో సమానంగా పొందే అవకాశం ఉండాలని రాజ్యాంగం పేర్కొన్నది. రాజ్యాంగ పీఠికలోనే ఈ విషయాన్ని పొందుపర్చారు. కానీ, ఆచరణలో జరుగుతున్నదేమిటో మనం పరిశీలించి చూస్తే విషాదమే.

రాజ్యాంగంలోని

17వ అధికరణ అంటరానితనాన్ని నిషేధిస్తుంది..

23వ అధికరణ మానవ అక్రమ రవాణాని, వెట్టి చాకిరీని, బలవంతపు శ్రమ దోపిడీని నిషేధిస్తుంది.

24వ అధికరణ బాలలు కార్మికులుగా పనిచేయటాన్ని నిషేధిస్తుంది.

25 (2) (బి) అధికరణ అందరితో సమానంగా దేవాలయ ప్రవేశాన్ని కల్పిస్తుంది.

46వ అధికరణ బలహీన వర్గాలు ముఖ్యంగా దళితులు, గిరిజనులు విద్యా, ఆర్థిక ప్రయోజనాల పట్ల ప్రభుత్వాలు ప్రత్యేక శ్రద్ధని తీసుకుని అభివృద్ధి చేయాలని, ఆయా వర్గాలను అన్ని రకాల దోపిడీల నుంచి సామాజిక న్యాయం చేస్తూ కాపాడాలని కోరుతుంది.

15(4) అధికరణ బలహీన వర్గాల కోసం ప్రత్యేకంగా చర్యలు చేపట్టాలని కోరుతుంది.

రాజ్యాంగంలోని ఆదేశక సూత్రాలలోని

38వ అధికరణం ఆదాయ అసమానత రూపుమాపేందుకు వ్యక్తుల మధ్యనే కాక, వివిధ వృత్తుల్లో, వివిధ వర్గాలకు చెందిన ప్రజా సమూహాల మధ్య కూడా, ఆదాయ అసమానతలు తగ్గించేందుకు, వారి వారి స్థాయిల్లో, అవకాశాల్లో, సౌకర్యాల్లో ఉండే అసమానతలను రూపుమాపేందుకు ప్రభుత్వాలు ప్రత్యేక కార్యాచరణ చేపట్టాలి.

39వ అధికరణ : ఉత్పత్తి సాధనాలు, సంపద కొన్నిచోట్లే కేంద్రీకృతమైన సమిష్టిగా నష్టం జరగకుండా ఆర్థిక వ్యవస్థ నిర్వహణను ప్రభుత్వమే చేపట్టాలి.

41వ అధికరణ నిస్సహాయులకు ప్రభుత్వ సహాయం చేయాలని చెబుతుంది.

47వ అధికరణ ప్రజల జీవన ప్రమాణాలను పెంచాలని, పోషకాహార స్థాయిని పెంచటానికి ప్రభుత్వమే ప్రత్యేకంగా చర్యలు చేపట్టాలని ఆదేశిస్తున్నది.

ఇక చట్టాల గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాల్సిన అవసరం ఉంది. అనేక చట్టాలు, అధికరణలు దళితుల రక్షణ విషయంలోకి వస్తే తమతమ రాజ్యాంగ స్ఫూర్తి నుంచి క్రమక్రమంగా తప్పుకోవటం సరికదా, వ్యతిరేకంగా ఆచరణలోకి వస్తున్నాయి.

1989 దళితులపై అత్యాచారాల నిరోధక చట్టం అమలులో ప్రభుత్వాలు అంతకంతకూ బేలగా మారుతున్నాయి.

ఎస్సీ, ఎస్టీ అట్రాసిటీ చట్టంపై నేరుగా సుప్రీంకోర్టే వ్యాఖ్యానించటం ఒకెత్తయితే, ఈ చట్ట రక్షణ కోసం ఉద్యమించిన దళితుల్లో 11 మందిని పోలీసు ఫైరింగ్‌లో చంపటం దళితులకు స్వతంత్రం ఇంకా రాలేదనే మాటని రుజువు చేస్తున్నది.

2016లో సుప్రీంకోర్టు 'నేషనల్ క్యాంపెయిన్ ఆన్ దళిత్ హ్యూమన్ రైట్స్ వర్సెస్ యూనియన్ ఆఫ్ ఇండియా కేసులో ఇచ్చిన తీర్పు మనల్ని విచారంలోకి నెడుతుంది. ఈ కేసులో ఇచ్చిన తీర్పులను పరిశీలిస్తే, చట్టాల నిర్వీర్యం ఎంత దీనంగా జరిగిపోతున్నదో తెలుసుకుని నివ్వెరపోతాం.

చట్టాలను అమలు చేయాల్సిన బాధ్యత నుంచి ప్రభుత్వాలు తప్పుకుపోవటమే కాదు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కుట్రపూరితంగా ఆచరణను నీరు గారుస్తున్నాయి. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు బాధ్యతగా వ్యవహరించి దళితులకి సంబంధించిన చట్టాల ఆచరణలో నిజాయితీగా ఉన్నప్పుడు మాత్రమే న్యాయం జరుగుతుందని రాజ్యాంగ ప్రవేశిక చెబుతున్నప్పటికీ ఆచరణలో ప్రభుత్వాలు ఘోరంగా విఫలమవుతున్నాయి. అనేకచోట్ల పోలీసు యంత్రాంగం కూడా ఉద్దేశ్యపూర్వకంగా ఈ ప్రక్రియ నుంచి తప్పుకుపోతున్నదని ఇటీవల జాతీయ మానవ హక్కుల కమిషన్ నివేదిక వెల్లడించింది.

ఉత్పత్తి సాధనాలు జాతీయ సంపదా మారాలనుకున్ననాడు ఉత్పత్తి సాధనాల విషయంలో సమాన అవకాశాలు అందరికీ లభించాలని భావించిననాడు. తద్వారా సమానత్వమనే సమస్యకూ, స్వేచ్ఛకూ వాస్తవమైన శాశ్వత పరిష్కారం లభిస్తుందని తలపోయవచ్చు.

స్వేచ్ఛ అంటే అదుపు నుంచి స్వేచ్ఛ కాదు, ఎంచుకోవటంలో ఉండే స్వేచ్ఛ, అటువంటి సమాజంలోనే వ్యక్తిత్వ వికాసం సాధ్యపడుతుంది.

రాష్ట్రాలు, మైనారిటీలు, వారి హక్కులు ఏమిటి?', భారత రాజ్యాంగంలో వాటిని పొందుపర్చటం ఎలా? అన్న అంబేద్కర్ వివరణ పత్రంలో – దాన్ని రాజ్యాంగ సభ చర్చల కోసం తయారుచేశాడు. రాజ్యాంగంపై తన దృక్పథాన్ని వివరించాడు.

ఆర్టికల్ 2, సెక్షన్ 2, నాలుగవ క్లాజ్‌లో... అంబేద్కర్ చిత్తు ప్రతిలో, కీలక పరిశ్రమలను, అంటే ప్రభుత్వం స్వయంగా నిర్వహించే పరిశ్రమలను.. భారత రాజ్యాంగంలో పొందుపర్చాలని సూచించాడు. అలాగే, కీలక పరిశ్రమలు కాకపోయినప్పటికీ, ప్రాధమిక పరిశ్రమలను కూడా ప్రభుత్వం కానీ, కార్పోరేషన్లు కానీ నిర్వహించాలని సూచించాడు.

అదే విధంగా భీమా వ్యాపారం ప్రభుత్వ ఆధీనంలో ఉండాలని, ప్రతి పౌరుడికీ తప్పనిసరిగా 'భీమా' అమలు చేయాలని కూడా ఆయన సూచించారు.

అన్నింటికంటే ముఖ్యంగా వ్యవసాయాన్ని పూర్తిగా ప్రభుత్వ పరిశ్రమగా వ్యవస్థీకరించాలని సూచించాడు.

కీలక పరిశ్రమలు, మౌలిక పరిశ్రమలు, భీమా, వ్యవసాయక భూమి, వాటిపై హక్కులను, నష్టపోతే పరిహారం ఇచ్చి స్వాధీనపర్చుకోవాలని సూచించాడు.

భూమిని ఒక స్థిరప్రమాణంలో విభజించి వ్యవసాయక పరిశ్రమ వ్యవస్థీకరించాలని సూచించారు.

ఈ వ్యవసాయ క్షేత్రాలను, సమిష్టి వ్యవసాయ క్షేత్రాల వలె, కులమతాల బేధాలు లేకుండా ఏర్పడిన గ్రామ సమూహాలు నిర్వహించాలని సూచించాడు.

ఉత్పత్తులను నిర్ణీత పద్ధతుల్లో పంచుకోవాలని, భూస్వాములు, కౌలుదార్లు, భూమిలేని కూలీలు ఉండరాదన్నారు.

ప్రభుత్వమే సమిష్టి వ్యవసాయ క్షేత్రాలకు ధనం, మంచినీటి సదుపాయం తదితర వనరులు కూర్చాలన్నారు. వ్యక్తిగతమైన వ్యాపార వ్యవస్థను వ్యతిరేకించకుండా ఉత్పాదకతను పెంచే విధంగా చర్యలు చేపట్టాలని కోరాడు. సమిష్టి వ్యవసాయ క్షేత్రాలు

ఉండాలని, కులమత బేధాలు లేని గ్రామ సమూహాలే వాటిని నిర్వర్తించాలని, ఉత్పత్తిని నిర్ణీత పద్ధతిలో పంచుకోవాలని కోరుకున్నారు. న్యాయ సమ్మతంగా సంపద విభజింపబడుతుందని, భూమిపై ప్రభుత్వ యాజమాన్యం ఉంటుందని, పరిశ్రమలు, వ్యాపార రంగం ప్రభుత్వ ఆధీనంలో ఉంటాయని, పారిశ్రామికంగా అభివృద్ధి చెంది, సంపద పంపిణీ సమంగా చేయబడిన అందరూ సమానమయ్యే సోషలిస్టు సమాజం సిద్ధిస్తుందని ఆయన భావించారు. కానీ, దీనికి భిన్నంగా, వ్యవస్థను అంతకంతకూ ప్రజలకు దూరం చేయటంలో పాలకులు వ్యవస్థను ఎలా దిగజార్చారో చూసి డాక్టర్ బాబా సాహెబ్ అంబేద్కర్ కలత చెందారు. ప్రైవేటు పెట్టుబడిదారీ విధానం సృష్టించిన కల్లోలం చూసి ఆందోళన చెందారు. భూమి సమంగా పంపిణీ కావాలని, భూసమగ్రత ఏర్పడాలని, తద్వారా దేశం వ్యవసాయ పరంగా వృద్ధి చెందాలని అంబేద్కర్ కన్న కలలు కల్లలుగానే మిగిలాయి. కోట్లాది మంది పేద కులాల దోసిట్లో చారెడు మట్టికూడా లేదు. ప్రజల ఆర్థిక జీవనంలో లక్షలాది కందకాలు తవ్వబడ్డాయి. శాసన సభలు, కార్యనిర్వాహక శాఖలు, జ్యుడిషియరీ అంతకంతకూ సామాన్య ప్రజానీకానికి దూరం కావటం వేగం అందుకుంటున్నది.

**డాక్టర్ అంబేద్కర్ రాజకీయ ప్రజాస్వామ్యానికి నాలుగు ప్రాధమికమైన ఆధారాలు:**

(1) ప్రతీ వ్యక్తీ సర్వ స్వతంత్రుడు

(2) వ్యక్తికి అవిభాజ్యమైన కొన్ని హక్కులు ఉంటాయి. రాజ్యాంగం ప్రసాదించిన హక్కును వదులుకునేటట్టు ఏ వ్యక్తినీ నిర్బంధించరాదు.

(3) వ్యక్తి తాను పొందిన సౌకర్యాలకు బదులుగా, రాజ్యాంగం ప్రసాదించిన హక్కును వదులుకునేట్టు ఏ వ్యక్తినీ నిర్బంధింపరాదు.

(4) ప్రభుత్వానికి ఉన్న పాలనాధికారాలను, ప్రైవేటు వ్యక్తులకు ఇవ్వరాదు. అని చెప్పిన మాటలు అన్నివిధాలా బలహీనపడ్డాయి. కేవలం వ్యక్తిగతమైన ఆస్తి, సంపాదన అన్వేషణలపై ఆధారపడిన సామాజిక ఆర్థిక వ్యవస్థ అంబేద్కర్ మాటలను పద్ధతిగా తిరస్కరణ ఆచరణగా నిరూపించుకుంటున్నాయి. 'కేవలం బతకడానికే తమ హక్కులను ఎందరు వదులుకోవాలి? వ్యక్తిగత పాలన క్రింద ఎంతమంది నలిగిపోవాలి' అని తర్వాత కాలంలో ఆయన వ్యక్తం చేసిన ఆవేదన ఎన్ని గుండెలను చేరుతుంది. చివరికీ పాలన ఎంతదాకా వచ్చిందంటే, కొత్తగా ఏదో చిన్నా చితకా ఉద్యోగంలో చేరే వ్యక్తి నుంచి నువ్వు ఏ యూనియన్‌లోనూ చేరననే హామీ పత్రం తీసుకునేదాకా! హక్కులు అడిగితే మీరే నన్ను శిక్షించొచ్చు అని సదరు వ్యక్తి నుంచి దఖలు పత్రం తీసుకునేదాకా!! దీంతో ఆకలితో, భయంతో, సంపన్న వ్యక్తుల దానధర్మాల మీద ఆధారపడి బతికేంతగా వ్యవస్థను దిగజార్చారు.

**తారుమారైన రాజ్యాంగ స్ఫృహ :**

డాక్టర్ అంబేద్కర్ రాజ్యాంగంలో సూచించిన 'స్వేచ్ఛ – స్వాతంత్ర్యం – సమానత్వం' అనే వాటికి అర్థాలు తారుమారు చేశారు.

వాటిని భూస్వాముల, పెట్టుబడిదారుల స్వేచ్ఛగా, వారి స్వాతంత్రంగా, వారి సమానత్వంగా ఏమార్చారు. పనిగంటలు పెంచటానికి, వేతనాలు తగ్గించటానికి పెట్టుబడిదారులకు స్వేచ్ఛ వచ్చింది.

బతకటానికి పనిహక్కు, పనికి సమానమైన సాధనాలపై సమానమైన వేతనపు హక్కు, సమాజపు వనరుల్లో భాగస్వామ్య హక్కు, తేలికగా న్యాయస్థానానికి చేరగల హక్కు... ఇట్లా అనేకం ఉన్నాయి.

న్యాయస్థానాలు తేల్చలేని, మానవీయ ప్రాముఖ్యతను చాటిన అనేక ఆదేశిక సూత్రాల స్వభావాన్ని పాలకులు పద్ధతిగా నీరుగార్చారు. రాజ్యాంగకర్తల స్ఫూర్తిని చట్టబద్ధంగా తుంగలో తొక్కారు.

ప్రజల సామాజిక, ఆర్థిక హక్కులను హరించివేయటం అంబేద్కర్ బతికి ఉన్న కాలంలోనే మొదలయ్యింది. దీనిని చూసే ఆయన తీవ్రంగా కలత చెందారు. ఓ సందర్భంలో నిర్వేదంతో '1950 జనవరి 26 మనం వైరుధ్యాలతో కూడిన జీవితం ప్రారంభిస్తాం. మనకు రాజకీయాలలో సమానత్వం సామాజిక ఆర్థిక జీవితంలో అసమానత్వం ఉంటాయి. రాజకీయాలలో మనిషికొక ఓటు, ఓటుకు ఒకే విలువ అనే సూత్రాన్ని గుర్తించబోతున్నాం. మనకున్న సామాజిక ఆర్థిక జీవితంలో మనకున్న సామాజిక వ్యవస్థ రీత్యా ఒకే విలువ అనే సూత్రాన్ని తిరస్కరిస్తాం. ఎంతకాలమీ వైరుధ్య జీవితం?' అని ఆయన ప్రశ్నించారు.

ఆర్థిక సామాజిక అసమానతల్ని గురించి ఆయన ఆవేదన చెందుతూ 'ఈ వైరుధ్యాలన్నీ వీలైనంత త్వరగా అంతం చేయాలి. లేనట్లయితే వారు ఎగరకొట్టేస్తారు. అట్టడుగు వర్గాల వారు ఈ పీడక పాలనతో విసిగిపోయారు. సమూహపు స్వరూప స్పృహ, వర్గ సంఘర్షణగానో, వర్గ యుద్ధంగానో మారకుండా చూసుకోవాలి' అన్నారు.

స్వతంత్రం సిద్ధించిన 26 సంవత్సరాల తర్వాత రాజ్యాంగంలో 42వ రాజ్యాంగ సవరణ ద్వారా 'సోషలిస్టు' అనే పదం చేర్చారు. ఐనా ఏమీ మారలేదు. అసలు సామాన్య ప్రజా జీవితంలోకి కనీస ప్రజాస్వామ్యమే రాలేదు, ఇక సోషలిజం దాకా మన ప్రయాణం ఎలాంటిదో ఊహించవచ్చు.

ఇక ఎలాగూ 'సోషలిజం' పదం చాటున కొనసాగుతున్న గందరగోళాలు అందరికీ తెల్సినవే. ఊహాత్మక సోషలిజం, ఫెబియన్ సోషలిజం, సోవియట్ సోషలిజం, చైనీస్ సోషలిజం, క్యూబన్ సోషలిజం తదితరాలతో మనం చూస్తూనే ఉన్నాం.

ఇన్ని కలిసీ మనకు పని హక్కును కానీ, సక్రమమైన కనీస వేతన హక్కు కానీ, విద్యాహక్కు కానీ, శాస్త్రీయ విద్యకు హామీ కానీ ఇవ్వలేకపోతున్నాయి. వ్యవసాయం, పారిశ్రామిక నిర్వహణలు, భూమి, ఆర్థిక ప్రణాళికలు, చట్టాలన్నీ పెట్టుబడిదారుల ప్రయోజనాల కోసం రూపుదిద్దుకుంటున్నాయి.

ఇన్నేళ్ళ భారతంలో స్వాతంత్రం సమయంలో అనుకున్న భూమి పంపిణీనే సక్రమంగా జరగలేదు. ఇక నీరూ అంతే. వ్యవసాయ సంస్కరణలను నీరుగార్చే వాళ్ళే తప్ప, స్వాగతించే పాలకులు లేరు. సంస్కరణలు ఆచరించని దొంగలు, చట్టాలను అనుసరించని నీచులు, ప్రభుత్వ సంక్షేమ పథకాలను తమ సైదోడు పెట్టుబడిదారులకు లబ్ధి చేకూర్చటానికి ప్రవేశపెట్టటం మనం చూస్తున్నాం. దారిద్ర నిర్మూలన వంటి పథకాలను సైతం పెట్టుబడిగా మార్చుకునే పనికిమాలిన పాలకులను మనం చూస్తున్నాం. ఇక న్యాయవ్యవస్థని కూడా పతన దశకు చేర్చి ప్రజాస్వామిక స్ఫృహకు గట్టిగా పాతర వేస్తున్న పాలకుల సంతతిని మనం చూస్తున్నాం. తమకు అనుకూలంగా తీర్పులు చెప్పని న్యాయమూర్తులను సైతం చంపేంతగా, బెయిల్ కోసం వందలాదికోట్లు న్యాయమూర్తులకు ఎరేసేంతగా న్యాయస్థానాలను దిగజార్చేశాము.

**స్వతంత్రం దొంగల పాలు :**

గ్రామీణ ప్రాంతాల్లో సామాజిక ఆర్థిక వికాసానికి తోడ్పాటు నందించే భూమి ఎవరి చేతుల్లో ఉంది? చట్టసభ, కార్యనిర్వాహక విభాగం, న్యాయ విభాగం ఈ మూడూ సక్రమంగా వ్యవహరించి వుంటే, భూమి ఎందుకు కొంతమంది చేతుల్లో బంధీగా ఉ ంటుంది. ఎందుకని ఈ మూడు విభాగాల్లో సంపన్నులే హల్‌చల్ చేస్తున్నారు.

భూమి నుంచి కానీ, చట్టసభల నుంచి కానీ వీరిని తొలగించి మనం రాజ్యాంగాన్ని అమలుపర్చుకోగలమా? నీటి పారుదల రంగం, విద్యుచ్ఛక్తి రంగం మీద విపరీతంగా ప్రభుత్వ ధనం వెచ్చిస్తున్న మనం ఆయా రంగాలు ఎవరికి ఎంత సేవ చేస్తున్నాయో గమనించి నియంత్రణ చేయగలమా?

పేద రైతులు, గ్రామీణ పేద కూలీలు అసలీ పథకాల, చట్టాల చూపులోకి వస్తున్నారా?

గ్రామీణ పేదరికం అలాగే వుంది.

గ్రామీణ ప్రాంతాల్లో సామాజిక ఆర్థిక వెనుకబాటుతనం అలాగే ఉంది.

నిరుద్యోగం, ఆకలి, పేదరికం అలాగే ఉంది.

భూమి పంపిణీలో అసమానతలు అలాగే ఉన్నాయి.

గ్రామీణ పేదల్లో వివక్షతను అనుభవిస్తూ దళిత, గిరిజన, ఆదివాసీలు అలాగే ఉన్నారు.

దేశంలో లౌకిక వాద స్వభావానికి విరుద్ధమైన వికృత స్వభావం పెచ్చుపెరిగి దేశ రాజ్యాంగ స్ఫూర్తిని ధ్వంసం చేస్తూనే ఉంది.

ప్రాచీన వారసత్వం అంటాం. అందులో మంచిని స్వీకరించక, చెడును ఆరాధిస్తూ వర్తమాన విధ్వంసాన్ని నెమరేస్తాం.

ఇక రాజ్యాంగాతీతమైన ప్రత్యేక రాజ్యాంగం కొందరిది. ఛాందసాన్ని ఇంకోరకంగా వ్యాఖ్యానించే వీరు పునరుద్ధరణ వాదం పేరుతో దేశాన్ని సర్వనాశనం చేస్తుంటారు. బాబాలూ, భగవాన్లూ.. మహర్షులు.,. యోగులు.. స్వామీజీలు ఇందులో ఒక వర్గం. వీళ్ళంతా దైవ పురుషులు. దేవుని ప్రతినిధులు. వీరికి తోడు జ్యోతిష్కులు, మంత్రగాళ్ళు, పంచాంగం, హస్త సాముద్రికం, వాస్తు తదితరాలు. దేశం మూలుగులు పీల్చటానికి రాజ్యాంగ స్వభావాన్ని నీరుగార్చటానికి, పాలనను భయపెట్టి అదుపులో ఉంచుకోడానికి. రామాయణ, మహాభారత, భాగవతాలను పుక్కిటబట్టి వాక్రుచ్చేవారు వేరు. దేశ ప్రజల రక్తంలోకి, హృదయంలోకి మూఢత్వాన్ని దిగుమతి చేయటం వీరి ప్రవృత్తి.

ఇన్నింటి మధ్య రిజర్వేషన్లు ఒక చిన్న ఊరట. దీనిని ఎంతగా బలహీనం చేయాలో అంతగా బలహీనం చేశారు. వాటిపేరు చెప్పి రాజ్యాంగ ఆకాంక్షలను దుంపనాశనం చేశారు. దరిమిలా ఇప్పుడు ఆర్థికంగా వెనుకబడిన వారికి కూడా రిజర్వేషన్లు (ఈబిసి) పేరుతో ఆ కొంచెం ఆశాపేగును కూడా తెంపేశారు. రాజ్యాంగం ఒక స్వప్నం. చిత్తశు ద్ధి కలిగిన పాలకులు ఆ కలను సాకారం చేస్తారనుకున్నాడు డాక్టర్ బాబాసాహెబ్ అంబేద్కర్. దేశం జెండా మారింది.. పాలకుల ఎజెండా మారలేదు. దేశాన్ని సర్వనాశనం చేసేవాళు ,,, భ్రమల్ని విస్తరిస్తూ దేశాన్ని నాశనం చేస్తున్నారు. ఒకేఒక్క చిన్న ఆశగా ఉన్న రాజ్యాంగాన్ని కూడా పద్ధతిగా, చట్టసభల సాక్షిగా రద్దు చేసే దిశగా ప్రయాణిస్తున్నారు. దేశం సమస్త పీడితులందరిదీ. ఈ విషయాన్ని తెలుసుకుని రాజ్యాంగాన్ని రక్షించుకుని దేశాన్ని మానవీయతతో పునఃస్థాపన చేయాల్సిన సందర్భం ఈనాడున్నది.

---

"రాజ్యాంగనీతి అనేది ప్రకృతి సహజమైన భావం కాదు. దీన్ని మనం అభివృద్ధి చేసుకోవాలి. మన ప్రజలు దీనిని నేర్చుకోవలసి వుందని మనం గుర్తించాలి. ఇండియాలో ప్రజాస్వామ్యం భారత భూమిపై, పైపై అలంకరణ మాత్రమే. నిజానికిది అప్రజాస్వామ్యం." – డా॥ బి.ఆర్. అంబేద్కర్

# 10. సంవిధానం - సంవాదం

– **గరిమెళ్ళ నారాయణ,** మానవవాహిని,
ముంబాయి, సెల్ : 9769294380

బ్రిటీషువారు క్రీ.శ. 1601 చట్టంతో ప్రారంభించీ 1935 ఇండియా చట్టం వరకూ ఈ దేశంలో వారి తాబేదార్లను తయారుచేసి దోపిడీని నిరాఘాటంగా సాగించడం కోసం చేసిన ప్రయత్నాలే కనిపిస్తాయి. మెకాలే చేసిన చట్టాలనే ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ సైతం కొనసాగించింది. ఈ క్రమంలో మన సంవిధానం కూడా కొద్దిమంది ఆలోచనలకు అనుగుణంగానే రూపొందింది. ప్రఖ్యాత కవీ, 'ఇంక్విలాబ్ జిందాబాద్' నినాదం రూపకర్త, భారత కమ్యూనిస్టు పార్టీ వ్యవస్థాపక సభ్యుడూ, ముస్లింలీగ్ నాయకుడూ మౌలానా హస్రత్ మొహాని కానిస్టిట్యూషనల్ అసెంబ్లీ సభ్యుడై ఉండి, రాజ్యాంగం రూపొందిన విధానంతో విభేధించీ సంవిధానంపై సంతకం సైతం చేయనిరాకరించడం చారిత్రక వాస్తవం. అంతేకాదు, ఆనాడు అతి తక్కువమందికే పరిమితమయిన వోటుహక్కును ఈ విధమయిన అప్రజాస్వామిక ప్రాతినిధ్యానికి వాడుకున్నారు. రెండో ప్రపంచ యుద్ధకాలంలో, క్విట్ ఇండియా ఉద్యమంలో ప్రజాభీష్టానికి విరుద్ధంగా వ్యవహరించిన రాజ్యాంగ రచయితల సంగతి గమనార్హం.

రాజ్యాంగ పీఠికని కవి హృదయంతో "భారత ప్రజలమయిన మేము..." అని మొదలుపెట్టడం మినహా మరెక్కడా ప్రజల సంక్షేమాన్ని గురించిన ప్రస్తావన లేదు. ఆదేశిక సూత్రాల్లో నామమాత్రపు ఆదర్శాల్ని గుప్పించడం మినహా, బలమైన ఆచరనాత్మక ప్రాతిపదిక కానరాదు. ఈ 70 సం॥రాల్లో సంవిధానానికి కట్టుబడి ఉంటామని ఒట్టుపెట్టుకున్నవాళ్ళే ఇప్పటికి వందసార్లకు పైబడి దానికి సవరణలు చేసారు, ఇంకా చేస్తూనే ఉన్నారు. ప్రజలు (యజమానులు) చేతే ఎన్నుకోబడిన పనివారు (శాసనసభ్యులు) సంవిధానంపై ప్రమాణం చేసి మరీ అధికారికంగా అక్రమాలకి కొమ్ముకాస్తూ, ప్రజలకి తెలీకుండా రహస్యాల్ని కాపాడతామనడం మరో గమ్మత్తయిన విషయం. ఈ తరహా అసంబద్ధమయిన పద్ధతులన్నిటినీ ప్రోటోకాల్స్‌గా ఎవరెప్పుడు చేసారో తెలీదు!

సంవిధానంలో దేశానికి ఇండియా అనీ, భారత్ అని పేర్లున్నాయి. ఇటువంటి విచిత్రం మరెక్కడా కానరాదు. ఈ సంవిధానాన్ని ఆలంబనగా చేసుకుని లెక్కలేనన్ని చట్టాలు, వాటి చుట్టూ అల్లబడిన అసంఖ్యాక కేసులూ ఈ రోజు దేశంలోని న్యాయ స్థానాలన్నింటిలోనూ నలబై లక్షల పైచిలుకు పెండింగ్‌లో ఉన్నాయి. ఇక ప్రజాస్వామ్య

బద్ధంగా జరుగుతున్నాయని భ్రమపడే వివిధ స్థాయిల్లోని ఎన్నికలు, ఓటుహక్కు, దాని ప్రభావం సుమారు శూన్యం. ఓటు మనం వేసామా లేదా అనేదాంతో నిమిత్తం లేకుండా ఐదు సం॥రాలపాటు నిరాఘాతంగా ప్రజలకోసం, ప్రజలచేత, ప్రజలతో అంటూ ప్రజల భాగస్వామ్యం ఏమాత్రం లేకుండా సాగిపోయే ఎన్నికల విధానం యిది.

సంవిధానం ఎప్పటికీ ఒకటి కాలేని మూడు అంశాల్ని సృష్టించింది (1) ఆదివాసీ ప్రాంతాలు; (2) ప్రత్యేక కేటాయింపులు; (రిజర్వేషన్లు) పొందుతున్నవారు; (3) పట్టణాలు నగరాల్లో జీవితవసరాల్ని ఉత్పత్తి చేయలేని ప్రజలు. కుల నిర్మూలన జరిగి మనువాదం అంతం కావల్సిన కాలంలో కుల భజనలు, మనుపూజలు జరుగుతున్నాయ్. శ్రామికులు దోచుకోబడుతున్నారు. మనిషికి మనిషికి మధ్య కట్టే గోడలకి ప్రోత్సాహం, రక్షణ కల్పిస్తోంది మన సంవిధానం. దేశం మీద పెత్తనం చేసేవి రెండు; ఒకటి ధనం, రెండు భయం. మూడు ముక్కలుగా విభజించిన అంశాలు ఎన్నటికీ కలవకుండా శ్రమజీవుల్ని శాశ్వతంగా దోచుకుందుకు ఏర్పాటు చేసుకున్నదే ఈ సంవిధానం. మామూలుగా ఇందులో పార్టీల ప్రసక్తి లేదు. పీపుల్స్ రిప్రెజెంటేషన్ యాక్ట్ ద్వారా పార్టీల సృష్టి జరిగింది. పార్టీల నియంత్రణకు ఏ చట్టమూ లేదు. లేకపోగా అనేక సదుపాయాలు, శాశ్వత ఎన్నికల గుర్తుల కేటాయింపుల వంటి బుజ్జగింపులు చాలానే ఉన్నాయి. పోతే, ఎన్నుకున్న ప్రతినిధులకు విధులు లేవు. వార్ని సేవకులుగా ఎన్నుకున్న యజమానుల (ప్రజలు)కు వారెవరూ జవాబుదారీ కారు. వాళ్ళేం చేసారో, చేస్తున్నారో చెప్పవలసిన పద్ధతేదీ ఇదమిద్దంగానైతే లేదు. సరిగా పనిచేయకపోతే పనినుండి తొలగించే అధికారం లేదు. పైగా దత్తపుత్రుల్లా అనేకానేక సుఖ సౌకర్యాల రక్షణ. కావాల్సినప్పుడు జీతభత్యాలు పెంచుకునే ఏర్పాటు. భూతద్దం పెట్టి వెతికినా ఆస్తుల్ని అనేక రెట్లు పెంచుకోని ప్రజాప్రతినిధులు కానరారు.

ఇదీ ప్రస్తుత సంవిధానం, దాని మానస సంతానం మనకి ప్రసాదించిన పద్ధతి. ఇదిలాగే కొనసాగితే బహుసంఖ్యాకులైన శ్రమజీవుల బ్రతుకులు ధనస్వామ్యానికి ఆహుతైపోవడం ఖాయం. అలా కాకుండా ఉండాలంటే, నేటి నేతిబీరకాయ ప్రజా స్వామ్యాన్ని కాదనీ ప్రజా భాగస్వామ్యంతో ప్రజాకీయాలే ప్రధానంగా, ధన-భయరహిత, ఆనందమయ లోకం, అందరి అవసరాల్ని గుర్తించే భద్రతతో కూడిన వ్యవస్థను సృష్టించాలి. కాలం గడిచిన సంవిధానాన్ని అందరం కలిసి తిరగరాసి సరికొత్త సంవిధానాన్ని నేటికి తయారుచేసుకోవాలి. చేసి తీరతారు. అన్యధా ప్రగతికి, వికాసానికి శరణం నాస్తి.

---

## రాజ్యాంగ స్పృహ ప్రజల్లో కలిగించడానికి జరుగుతున్న కొన్ని ప్రయత్నాలు

* రాజ్యాంగ హక్కుల పరిరక్షణ సమితి (ఆర్. హెచ్. పి. ఎస్). ఇది కడప కేంద్రంగా కార్యక్రమాలు చేస్తున్నట్లు తెలుస్తోంది.

* రాజ్యాంగ పరిరక్షణా వేదిక (అంబేద్కర్ రాజ్యాంగం శరణం గచ్ఛామి). నల్గొండజిల్లా, తిరుమలగిరి మండల్ కొంపల్లి గ్రామంలో ఉన్నట్లు సామాజిక మాధ్యమాల ద్వారా తెల్సింది.

* ప్రేమ ఆనంద ఆధ్యాత్మిక సంస్థ భారత రాజ్యాంగ పీఠిక (ప్రియాంబుల్)ని కేలండర్లపై ప్రచురించడమే కాకుండా, అధికారిక ప్రభుత్వ / పబ్లిక్ సమావేశాలు, సామాజిక సాంస్కృతిక ఉత్సవాల్లో / పీఠికని చదవడమనే సత్సంప్రదాయాన్ని నెలకొల్పడానికి ప్రయత్నిస్తోంది.

* 'రాజ్యాంగాలయం' పేరిట రాజమండ్రిలో మిత్రుడొకాయన ఉత్సాహంతో 'ఇంటిలో కార్యాలయం రూపంలో పెట్టి 'వివాహ భావజాల సదస్సు వంటి యత్నాలేవో చేసారు కానీ తర్వాత కొనసాగించలేదు.

* 'సమాచార హక్కు ప్రచార ఐక్యవేదిక' రాజ్యాంగమే భారతదేశపు ధర్మశాస్త్రం పేరిట ప్రజానీకంలో రాజ్యాంగ కనీస స్పృహని పెంపొందించడం కోసం కృషి చేయటమే కాక, రాజ్యాంగ నిర్మాణ సభలో డా॥ అంబేద్కర్ ఇచ్చిన మూడు చారిత్రాత్మక ఉ పన్యాసాల పుస్తకం ప్రచురించి ఉభయతెలుగు రాష్ట్రాల్లో జనంలోకి తీసికెళ్ళేందుకు ప్రయత్నించింది.

* ప్రజాసైన్స్ వేదిక తరఫున విజ్ఞాన ప్రచురణల విభాగం వారు 'డెబ్బయ్యేళ్ళ భారత రాజ్యాంగం, విశ్లేషణాత్మక పరిచయం' అనే చిన్ని పొత్తాన్ని గతేడాది ప్రచురించారు.

**(ఇవే కాకుండా ఒకవైపు అంతర్జాతీయ స్థాయిలో World Constitution and Parliament Association & Earth Federation ఉద్యమాల వంటివి, One World Renaisance, Class Room Constitution (తరగతి గది రాజ్యాంగం) అలాగే సహ-అస్థిత్వాన్ని ప్రచారం చేస్తున్న 'జీవన విద్య' కార్యక్రమంలో భాగంగా 'మానవ సంవిధాన్' గురించిన చర్చ జాతీయ స్థాయిలో సాగుతుండగా, మరోవైపు ఈ దేశాన్ని నడిపించేది 'రాజ్యాంగమా? పంచాంగమా??' అని ప్రశ్నిస్తూ కార్యక్రమాలు జరుగుతున్నాయి. బాంసెఫ్, బౌద్ధ సంస్థలూ, హక్కుల సంఘాలు, కుల నిర్మూలనా వేదికలు, కులాంతర వివాహ సమితులు, దళిత బహుజన అభ్యుదయ సంస్థలు మా దృష్టికి రానివి కూడా ఇంకా ఉన్నాయి.)**

---

# ముగింపు

*'సమాజానికి క్రమశిక్షణ నేర్పి, ప్రజలను వారు నిర్దేశించుకున్న సామాజిక పరివర్తనవైపు సుముఖులుగా చేయడమే ఏ సమాజంలోనయినా రాజ్యాంగ, చట్టబద్ధ వ్యవస్థ లక్ష్యం. ఒకవేళ ఈ క్రమం గనుక దెబ్బతింటే, సక్రమంగా అమలు జరగకపోతే అది అసలు ప్రజాస్వామ్యాన్నే రద్దుచేసి వేస్తుంది. ఎందుకంటే, అసలు ప్రజాస్వామ్యాన్ని నెలకొల్పడానికే మనం ఒక రాజ్యాంగం రచించుకున్నాం.... రాజ్యాంగ బద్ధంగా పాలన సాగిఉన్నట్లయితే ఈ దేశంలో విప్లవం గురించిన ఇంత ఆలోచన ఉండేదే కాదు. జీవితం ఎంతోకొంత సంతృప్తికరంగా ఉండేది."*                    *– కె.జి. కన్నాభిరాన్, 24 గంటలు*

'కులానికో సవాలు' ప్రచురించి సరిగ్గా ఐదు సంవత్సరాలైంది. 2014 నవంబర్‌లో వచ్చిన ఆ నా రచన ఉద్యమాల దుమ్ముదులిపిందని దాన్ని ఆవిష్కరిస్తూ అనేక మంది మిత్రులు అభిప్రాయపడ్డారు. కొన్ని భావాల్లో క్రమబద్దీకరణ మినహా నాటి భావ తీవ్రతలో తేడా లేదు. ఒడిదుడుకుల్ని ఒడిసిపట్టి నిర్మాణాత్మకంగా మలచడమే ఏ ఉద్యమ కార్యకర్తకయినా ఉండాల్సిన వివేచన. అలా రూపొందిందే ఈ రాజ్యాంగంపై సంకలనం ప్రచురించే ఆలోచన. నిజానికి కొన్ని సం॥రాల క్రితం ఎస్.ఎమ్. జోషి ఫౌండేషన్‌కి చెందిన సుభాష్ వారే 'భారతీయ సంవిధాన్' అనే రచన చేసారు. దానిని జనతాట్రస్ట్ ప్రచురించింది. అప్పట్లో అది అనువదించాలనుకున్నాను. కానీ, అవలేదు.

ఒకరి ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా, నిష్పక్షపాతంగా చట్టబద్ధమయిన ఒక హామీపత్రాన్ని ఈ దేశవాసులుగా ప్రకటించుకుని 70 సం॥రాలైంది. రాజ్యాంగాన్ని సర్వరోగనివారిణిగా భావించి నెత్తిన పెట్టుకోవడమో, సకల చెడులకు మూలంగా తలచి గుడ్డిగా తులనాడడమో కాకుండా హేతుబద్ధమయిన దార్శనిక దృష్టికోణంలో విశ్లేషించుకోడానికి ప్రయత్నించడం ఈనాటి అవసరం.

అందుకోసం ఎన్నో ప్రయత్నాలు జరిగాయి, జరుగుతున్నాయి, జరుగుతాయ్. నిజానికి రాజ్యాంగంపై అవ్వాల్సినంత చర్చ అవలేదనే అసంతృప్తి కూడా ఉంది. మిత్రులు, సమాజ హితులు ఇందుకోసం కృషి చేసేవారు ప్రతి తరంలోనూ కొందరుండాలి. అందరికోసం ఆలోచించేవారు కొద్దిమందైనా ఉండటం వల్లనే, సొంతం కోసం మాత్రమే ఆలోచించేవారిని ఈ మాత్రమైనా కట్టడి చేయగలుగుతున్నారు.

అయితే, రానురానూ ఈ పరిస్థితి మారుతోంది. మార్పు మంచివైపుకే జరగాలని ఆశించేవారి సంఖ్య సమాజంలో సన్నగిల్లుతున్నవేళ, ప్రశ్నించే స్వభావాన్ని కాపాడుకోవడం కోసమైనా రాజ్యాంగంపై హుందాతనంతో కూడిన సంవాదాలు విస్తృతంగా జరగాలి. మనిషి భవిష్యత్ చిత్రాన్ని మరింత సుసంపన్నం చేసే దిశగా మన పయనం కదలాలి. అలాంటి కదలికల్ని అదిలించే పట్టుసడలని ఆచరణ మాత్రమే ప్రస్తుత వ్యవస్థని గట్టెక్కించేందుకున్న చిన్న ఆశ, ఆ ఆశలకి ఆసరా ఇవ్వడమే అక్షరాల శ్వాస.

అదే మానవాళికి మిగిలిన భరోసా, సెలవు.

---